
సమాధి
శ్రీ. బి.యన్.సూరి.
ANAND
సాంఘిక నాటకము

# సమాధి

## ( నాటకము )

రచయిత:

బి. యస్. సూరి

—: పబ్లిషర్స్ :—

క్వాలిటీ బుక్ షాప్,

గుడివాడ. :: (కృష్ణాజిల్లా.)

నంబరు 53.



మూల్యం 1-4-0

ప్రథమ ముద్రణ
1000 ప్రతులు.

జ్యోతీ ప్రెస్
గుడివాడ.

# ఏమండోయ్ !

ఒక్క మాట !
చదువుతారా ?
అయితే చదవండి !

ఈ నాటకం ప్రదర్శించు వారుగాని, స్క్రీన్ చేయు వారుగాని, రికార్డింగు చేయు వారుగాని, రేడియో బ్రాడ్ కాస్టింగు చేయువారుగాని, పాటలు విడిగా ఉపయోగించు కొనువారుగాని నా లిఖిత పూర్వకమైన అనుమతి ప్ర పొందవలెను. అట్లు పొందని యెడల ఆయా నటీనటుల నిర్వాహకులు, ఆర్గనైజర్స్. మ్యూజిక్ స్టాఫ్‌వారు నేను ప్ర పబోవు సివిల్ క్రిమినల్ చర్యలకు బాధ్యులగుదురని హె రిస్తున్నాను.

ఇట్లు,
బి. యస్. స:

టెంపరరీ అడ్రస్ : C/o క్వాలిటీ బుక్ షాప్
గుడివాడ.

## నావమాట

నా రచనలు లోగడ అందరికీ తెలిసినవే! నాటక రంగంలో వున్న అనుభవంతో నే యీ నాటికలూ, నాటకాలు వ్రాస్తున్నానని లోగడ మనవి చేసుకున్నాను. నా రచనలు రసవంతంగా వున్నా లేకపోయినా ప్రదర్శనానుకూలంగా వుంటై అని నా నమ్మకం.

1952-53 ఆ ప్రాంతాల్లో జరిగిన యదార్థ గాథను ఆధారంగా తీసుకుని యీ నాటకం వ్రాశాను. యీ నాటకం ఒక క్రొత్తపోకడ. నాటకంలో నాటికలు ప్రవేశపెట్టటం యిదే మొదలనుకుంటాను. నాటక నాటికకూ యిన్‌స్ట్రక్షన్స్ ఇచ్చిన ప్రకారం మేకప్ ఛేంజ్ చేసుకుంటుండాలి. లేనిపక్షంలో ప్రేక్షకులకు అపార్థంకలిగి నాటకం దెబ్బతింటుంది.

ఈ నాటకానికి ముఖ్యంగా మూడు మైక్‌లవసరం. 1. ఆర్కెష్ట్రాకు, 2. రంగస్థలంమీదకు, 3. బ్యాగ్రౌండ్ డైలాగ్సుకు. అవకాశమున్న హాల్సులో లైటింగ్ ఎఫెక్ట్సు చూపటం నాటక రక్తికి అనుకూలిస్తుంది.

అవసరమైనవాళ్లు యిందులోని నాటికలు (1. ఇల్లరికం, 2. సుడిగుండం) పర్మిషన్ తీసుకొని విడిగా ప్రదర్శించుకోవచ్చును.

ఈనాటకపు కాపీరైటు హక్కులు శ్రీ కొమ్మిరెడ్డిరామా రావుగారికి చెందియున్నవి. ప్రదర్శన హక్కులు మాత్రం నావి.

ఈ నాటకము ప్రదర్శింపదలచుకున్నవారికి మేకప్: పి. శివరావు, గుడివాడ; లైటింగ్ ఎఫెక్ట్సు: మోడరన్ మైక్ అండ్ లైటింగ్ సర్వీస్, గవర్నరు పేట, విజయవాడ. వాళ్ళను మీతో ఏకీభవింప చేసుకున్నచో కరెక్టు ఎఫెక్ట్సు చూపగలరు.

తప్పులున్న తెలియపరుస్తే మలి ముద్రణలో సరిదిద్దుకుంటాను.

పర్మినెంట్ అడ్రస్ :
"జ్యోతీ థియేటర్స్"
సూరి భవన్
సత్యన్నారాయణపురం
విజయవాడ 2.

నమస్తే
భవదీయుడు.
బి. యస్. సూరి.



ముఖచిత్రం :
"రాజ్యం థియేటర్స్" వారి "సమాధి" లో
సూరి, సీతాకుమారి
ఆర్టిస్టు : కె. ఆనంద్ (గుడివాడ)

# ★ అంకితం ★



జననం: 16-2-1925



మరణం: 21-7-1953



## అ॥ రాజ్యలక్ష్మమ్మ.

అక్కా !

అంతిమ ఘడియల్లో నీ దగ్గర లేకపోవటం నా దురదృష్టమే. నా కోసం ఎంతో పరితపిస్తూ ఏమేమో చెప్పాలని ఎదురు చూశావట. ఆఖరికి నీ కోర్కె తీరకుండానే నిరాశా నిస్పృహలతో నిర్జీవివయ్యావు. అయినా నువ్వు చెప్పదల్చుకున్న విషయాలు నాకు తెల్సు. నా జీవితాంతం వరకూ నీ కుమార్తెలు చి॥ వసంతకుమారి, శ్యామకుమార్లకు ఏలోటూ రానివ్వనని మాటయిస్తూ అశ్రునయనాలతో నా యీ చిన్ని పొత్తాన్ని నీకు అంకితమిస్తున్నాను. స్వీకరిస్తావుకదూ !

నీ సోదరుడు,

బి. యస్. సూరి.

## *Sri B. N. Suri*



became a good - friend to me when I am working as an Assistant Engineer Food Production Sub-division, Vijayawada. He possess good charactor.

I have attended several Dramas enacted by him, in which he is proved that he is fit to be selected in Filmdom.

In addition to this he wrote several dramas and one act plays. I have gone through them and found them to be stylish.

I wish him to get a good chance in the Filmdom and prosper and I also wish him to write more "Dramas" and "one act" plays and give a good impression to accorince besides people.

I found him to be more active in acting comic rols than Hero cheractors.

I wish him success.



Camp:
VIJAYAWADA
1 - 6 - 1952.

C. Ramachandra Moorti,
Assistant Engineer,
( P. W. D. )

17

త్వరలో !                                                   ఆంధ్రదేశమంతటా !!

"రాజ్యం థియేటర్స్"వారి

# "సమాధి" (సాంఘిక నాటకం)

—♦ నటీ నటవర్గం ♦—

రవి :- బి. యస్. సూరి

రావు:- సీతంరాజు

బాబు:- సముద్రాల

భాను:- అడుసుమిల్లి

S. I :- **S. A. V S**

రాణి:- శ్రీమతి సీతాకుమారి

రచన, దర్శకత్వం:- బి. యస్. సూరి

టూరిప్ ఆర్గనైజర్స్:- బి. వీరవెంకయ్య & కృష్ణా.

మ్యూజిక్ :

జి. గంగరాజు అండ్ పార్టీ (ఏలూరు)

నవకళావని (బందరు)

రాజ్యం థియేటర్స్ (గుడివాడ)

ఆర్కెష్ట్రా : కె. చంద్రం, బి. సత్యం, ఎ. సత్యం

మేకప్ :- పి. శివరావు

వివరములకు :

"రాజ్యం థియేటర్స్"

పువ్వుల అనసూయ బిల్డింగ్స్, గుడివాడ.

## పాత్ర పరిచయం

★ **రవి** - కథకుడు, కవి, నాటక సమితి నిర్వాహకుడు. వయస్సు 22 సం॥ లు.

★ **రావు** - అతని తండ్రి. పట్టుదలగల మనిషి. వయస్సు షుమారు 40 సం॥ లు.

★ **బాబు** - అతని మిత్రుడు, ఎమెచ్యూర్ నటుడు, వయస్సు షుమారు 22 సం॥ లు.

★ **భాను** - రాణి తల్లి తమ్ముడు (మావయ్య) రాణి అభిమానస్తుడు. వయస్సు 25.

★ **S. I.** - సబ్ యిన్‌స్పెక్టర్. వయస్సు 25.

★ **రాణి** - ఆదర్శ యువతి. రవి ప్రియురాలు. నేటి నటి. వయస్సు షుమారు 18.

★ ★ ★

# సమాధి

## 1వ రంగము



(స్థలం: స్మశానము. సమయం: షుమారు రాత్రి 12 గంటలు. ఒక సమాధి; కొన్ని ఎముకలు, పుర్రెలు చెల్లాచెదురుగా పడివుంటై. ఒక ప్రక్క ఎండిపోయిన రాగిచెట్టు - ఆ చెట్టునానుకొని ఒక వ్యక్తి (రవి) అయోమయంగా పక్షుల కిలకిలారావం చూస్తుంటాడు. మాసిన గడ్డం - పెరిగిన జుట్టు - చినిగిన బట్టలు - పిచ్చివాని ఆకారం) —

తెరలో): ఎవరీ నిశాచరుడు? అర్ధరాత్రిపూట యీ స్మశానంలో ఏంపని? ఏంచేస్తున్నావ్? ఎందుకలా నిలబడ్డావ్? మాట్లాడవేం?

రవి :- (పెద్దగా నవ్వాడు)

(తెరలో రాణి పాట)

ఓహో రాజా! రావో రాజా!
రయమున లేచిరా గదోయీ
జయముగ రావేల నోయీ ॥ ఓ ॥
అందములో చంద్రుడ వీవు
చందములో తారను నేనౌనా ॥ ఓ ॥
తారాచంద్రులమై తేలియాడుచు
ఆదర్శంబుగ నడపుదమే
నావను నడుపుదమే ॥ ఓ ॥



రవి :- (పాట వినిపిస్తున్నవైపే ఆనందంగా) రాణీ! రాణీ! రాణీ! ...

(అంటూ వెళ్తూండగా సమాధి కాళ్ళకు తగిలి క్రింద పడతాడు. తెరలో తండ్రి మాటలు వినిపిస్తుంటై) —

రావు:- (నవ్వి) కులభ్రష్టుడా! నా మాటలు వింటే నిర్విచారంగా నీ యిష్టమొచ్చినట్లు చేసేవాణ్ణి. నా యిష్టానికి వ్యతిరేకించి ప్రవర్తించినందుకు వచ్చిన నష్టాన్ని గుర్తించి సన్మార్గంలో నడవటానికి ప్రయత్నించు

రవి :- ఆఁ...! నాన్న!

రావు:- ఆఁ నాన్నే!... ఏంకావాలి?

రవి : (బాధగా) కావాలని కోరిందాన్నిచ్చారు కాబట్టా! మళ్లీ కోరమంటారు?

రావు:- నువ్వు కోరిందేది కాదన్నాను?

రవి :- మనస్ఫూర్తిగా ప్రేమించి నా హృదయాన్ని నా రాణి కర్పించాను. అందుకే ఆపడను తప్ప అన్యులను వివాహమాడనని. అందుకు అంగీకరించమని అర్థించాను.

రావు:- అర్థించినమాట నిజమే! కాని మన గౌర అగౌరవాలు కూడా ఒక్కసారి గుర్తించాలి. కులవిచక్షణ, జాతివిచక్షణ పాటించాలి.

రవి :- నాన్నా! కుల మత జాతి విభేదాలు సమసిపోయి చాలాకాలమైంది.

రావు:- నా మాట విను. కులంగల పిల్లను పెళ్ళి చేసుకుని నన్ను నలుగురిలో తలెత్తుకు తిరగనియ్! పవిత్ర ప్రేమంటూ పిచ్చి పిచ్చిగా ప్రసంగాలిచ్చేవాళ్ళందరూ మోసకారులు. వాళ్ళు శాశ్వితంకారు!

రవి :- ఆఁ! శాశ్వితంకారూ? కాదు. నా రాణి అలాంటది కాదు. ఆవిడ హృదయం నాకు తెలుసు.

రావు:- (నవ్వి) అమాయకుడా యింత అయోమయంలోబడి కుమిలిపోతున్నా వేమిటి? నాటకాలు వ్రాస్తావు. నీ రచనల ద్వారా ప్రజలకు వెలుగు నందిస్తావు; నటిస్తావు. కాని ఏం లాభం? నీ జీవిత నాటకరంగంలో మైమరచి నటిస్తున్నావ్! ఇప్పటికైనా లే! కళ్ళు తెరువ్! నా మాట విను! రా! రా! రా!

రవి :- ఆఁ ... వస్తున్నా నాన్నా! నీ కోర్కె ప్రకారమే వివాహం చేసుకుని నీ పరువు మర్యాదలు కాపాడుతాను. (వెళ్ళబోతాడు)

(రెండవ వైపునుండి తెరలో రాణి మాటలు వినిపిస్తై)

రాణి:- మోసం!

రవి :- ఏది మోసం?

రాణి:- నువ్వు చేసింది మోసం!

రవి :- కాదు; నే నెవ్వరికీ మోసం చెయ్యలేదు.



రాణి:- (నవ్వి) యిది మోసం కాదుకదూ? మనస్ఫూర్తిగా ప్రేమించి దొంగ ప్రమాణాలుచేసి నీ యిష్టమొచ్చి నన్నాళ్ళు కాలం వెళ్ళబుచ్చుకుని కడకు కన్నతండ్రి మాటలు కాదనలేక ... ...

రవి :- (కోంపగా) రాణీ!

రాణి:- ఓఁ! కోపం వచ్చిందా?

రవి :- లేదు. నేను వెళ్ళను. నా జీవితం నీకే ధారపోస్తాను. ఇది ముమ్మాటికీ సత్యం — (అంటూ రాణివైపు వెళ్ళబోతాడు)

రావు:- [మొదటివైపునుండి తెరలో] (వెర్రినవ్వు) పిచ్చివాడా! ఆడదాని మాటలు కాదనలేక అంధుడవౌతున్నావ్!

రవి :- ఆఁ! (తండ్రివైపు వెళ్ళబోతాడు)

రాణి:- [రెండవవైపు తెరలో] నమ్మించి మోసం చేయటం మీకు భావ్యమేనా?

రవి :- (రాణివైపు వెళ్ళబోతాడు)

(రాణి, రావుల పై మాటలు 5, 6 పర్యాయములు వినిపిస్తై. రవి అయోమయంగా అటూ యిటూ ఆలకిస్తూ నిస్పృహతో సమాధిమీద తూలిపోతాడు)

(తెరలో కథ వినిపిస్తుండగా తెర పడుతుంది)

— తెర —

— తెరలో —

రావుగారు ఆవూరి లక్షాధికారి. ఆయన ఏకైక పుత్రుడు రవి. చిన్నప్పటి నుండీ తల్లి లేకపోయినా అల్లారు ముద్దుగా పాలుపోసి పెంచాడు. దానికి ప్రతిఫలంగా దినదినాభి వృద్ధినొందుతూ రవి యుక్తవయస్కు డయ్యాడు. చదువుకు స్వస్తి చెప్పి నాటక కళను ఆధారంగా తీసుకుని నాటకములు వ్రాస్తూ ప్రదర్శనలిస్తూ ఆంధ్రదేశమంతటా అఖండ విజయం నార్జించు కుంటున్నాడు. కళ; కళకోసమే గాని - కాసు కోసం కాదని నిరూపించాడు. కాలం మారింది. రాణిని తన నాటకాలలో కథానాయకురాలిగా నియమించాడు. మనస్సులు కలిసినై. హృదయాలు ఉప్పొంగినై. ఇరువురూ గాఢంగా ప్రేమించుకున్నారు. ఏక బాటనే కళాసేవ చేయటానికి కదం త్రొక్కుతూ ముందడుగేయటానికి ప్రయత్నిస్తున్నారు. ఈ విషయం యిరుపక్షాల తలిదండ్రులకూ యిష్టం లేదు. ఇట్లుండగా ఒకరోజున ...

[ఆలశ్యం లేకుండా రెండవరంగం ప్రారంభించవలయును]

# సమాధి

## 2వ రంగము



[తెరలేచే సరికి ఒక టేబుల్, దానిపైన టేబుల్ క్లాత్, అద్దం, దువ్వెన, పూలకూజా దానికిరుప్రక్కలా రెండుకుర్చీలు, గోడకు భగవంతుని ఫోటోలు, సినిమాతారల క్యాలండర్లు, రావు, రాణీ ఫోటోలు అలంకరించి వుంటై. రాణి పాట పాడుకుంటూవస్తుంది.]

(రాణి పాట).

విశ్వమంతా నాటక మయం
ప్రజలంతా పాత్ర ధారులే
ఆకలితోటి అలమటించెడి
అనాథల ఆక్రందనాలు
అమాయకుల దీనాలాపనలు
ఆలకించేవారే అదృశ్యమైరి
అంకుల కిరువురమొకటై
అఖండ విజయం చేబూనుటకై
దేశాలన్నీ దద్దరిల్లగా
ప్రపంచమంతా ప్రబోధింపగా
సాంఘిక నాటక సాయముతో
పీడిత ప్రజకై పాటుపడుటకు
దీక్ష బూనితిమోయీ నేడే
దీక్షబూనితిమోయీ !



(పాటయ్యేటప్పటికి భాను సిగరెట్టు కాలుస్తు చిరాగ్గా వస్తాడు)

భాను:- (సీరియస్‌గా) రాణీ! (అంటూ సిగరెట్టు నేలకేసి కొట్తాడు)

రాణి:- (తాపీగా) ఏం మావయ్యా?

భాను:- ఏమిటే ఎప్పుడూ ఒకటేగోల?

రాణి:- ఏంచేశాను?

భాను:- ఏమిటా సంగీతం?

రాణి:- ఏం? బాగుండలేదా? నీకు బాగుండదని నాకు తెలుసు. ఆ విషయం నాకు తెలుసునని నీకూ తెలుసు. కదూ! అయినా యిది నాటకాలల్లో, సినిమాలల్లో సంగీతం కాదు.

భాను:- అని చెప్పకుండానే అర్థమౌతుందిలే!

రాణి:- అర్థమైతే అడగటమెందుకూ?

భాను:- అడగటం అర్థమైంది కాబట్టే.

రాణి:- అయితే విను: ఇది నా జీవిత నావకు ఒడుగుడుకులు లేకుండా దారిచూపే చుక్కానే యీ పాటలోని భావం.

భాను:- రాణీ! నీకు రాను రానూ మతి పోతోంది. చేసే పనులకు హద్దూ పద్దూ వుండాలి.



రాణి:- అనే మాటలకుకూడా అదివుంటే బావుంటుందేమో !

భాను:- యింతకీ ఏమిటి నువ్వనేది ?

రాణి:- ఏమీలేదు. రవిగారిని మనస్ఫూర్తిగా ప్రేమించాను. అందుకు వారిని ఈ జీవిత రథానికి సారథిగా నియమించుకో దలచాను.

భాను:- ఏమిటీ !

రాణీ:- అవును మామయ్యా ! ఆయన్ను ఏనాడు చూచానో అప్పుడే నా హృదయం వారి వశమయ్యింది. అందుకే వారికి నాయావజ్జీవితం ధార పోయడానికి నిశ్చయించుకున్నాను.

భాను:- ఆలోచించుకునే మాట్లాడుతున్నావా ?

రాణి :- ఈ విషయంలో యింతకంటే ఆలోచించాల్సిన పని లేదు.

భాను:- అయితే మీ అమ్మా - నాన్నా నిన్ను యెవరికి అప్పగించి వెళ్ళారో తెల్సుగా !

రాణి :- తెలియకేం ? తెలుసు. కాబట్టేగా యిక్కడవుంది -

భాను:- అయితే నా యిష్టప్రకారం నువ్వు నడవాలా ... నీ యిష్టప్రకారం నేను నడవాలా ?

రాణి :- నీ యిష్టప్రకారమే నడుస్తున్నానుగా !

భాను:- అయితే యిహనుంచి ఆ రవి పేరు నా ముందు ఎత్తటానికి వీలులేదు.

రాణి :- అలాగే! పోనీ నా హృదయంలోనైనా తల్చుకో వచ్చా?

భాను:- ఏదీ జరగటానికి వీలు లేదు.

రాణి :- ఆమాట అనటానికి మీకు అధికారం లేదు -

భాను:- ఎందుకు ?

రాణి:- ఒకళ్ల యిష్టాయిష్టాల కోసం నా జీవితాన్ని నాశనం చేసుకోను.

భాను:- నాశనం చేసుకోనటం ఎందుకు ! అందుకు కాదు నిన్న అల్లారు ముద్దుగా యింతకాలంనుంచి పెంచి పెద్దదాన్ని చేసింది. మీ అమ్మా నాన్న వెళ్ళేటప్పుడు ఏం చెప్పారో తెలుసా ?

రాణి:- ఏంచెప్పారు ?

భాను:- నా చిట్టితల్లిని నీకు అప్పగించుచున్నాము. ఆస్థంతా నీ పేరనే వ్రాస్తున్నాము. ఆపిల్లను పెంచి పెద్దదాన్ని చేసి పెళ్లి చేసే బాధ్యత నీమీద పెడుతున్నామని చెప్పి ప్రాణాలు విడిచారు.

రాణి:- అంతేగా చెప్పింది. నేను రవిగారిని కోరుతున్నాను. వారికి నన్నిచ్చి ఆనందంగా వివాహంచేసి మమ్ములను ఆశీర్వదించి పంపు మామయ్యా !



భాను:- రాణీ! నిన్ను యీ నాటకాలలో దింపింది వాళ్ళనూ వీళ్ళను ప్రేమించమని కాదు - సంగీతం నేర్పించమంటే నేర్పించాను. నాటకాలలో వేషాలు వేయాలని సరదాగా వుందంటే నీ మాట కాదనలేక సరేనన్నాను. యీ విషయంలోకూడా నీ ఆటలు సాగుతయ్ అను కుంటున్నావ్ -

రాణి:- మామయ్యా! నా ఆనందమే; నీ ఆనంధం కాదా?

భాను:- మరి నా ఆనందం నీ కవసరంలేదా ?

రాణి:- అని నే నెప్పుడూ అనలేదు -

భాను:- అయితే; నా యీకోర్కె నెరవేర్చు.

రాణి:- ఏమిటీ !

భాను:- నిన్ను యింతకాలంనుంచీ పెంచి పెద్దదాన్ని చేసింది ఒకరి చేతుల్లో పెట్టటానికి కాదు. (ప్రేమగా) యీవిష యం నీకు లోగడ యెప్పుడూ చెప్పలేదు. యిప్పుడు చెపుతున్నాను. నిన్ను నేను మనస్ఫూర్తిగా ప్రేమి స్తున్నాను. నా హృదయాన్ని నీకు ఏనాడో అర్పిం చాను. నీ సుందర విగ్రహం చూచి నాలో నేను పొంగిపోతూ ఎన్నెన్నో కలలు కంటున్నాను. నీ మిలమిలా మెరిసే నీ ముఖారవిందం చూచి నాలో నేను తృప్తిచెందుతుంటాను. యివన్నీ ఎందుకూ ? ఎప్పటి కైనా నారాణి నాదేనని. అంతేకాని నిన్ను మరొకరి



దిగావు. నువ్వు ఎంతసేతిగా చెప్పినా కీలవతిగా పరిగ ణించరు. అందుకు నువ్వొక ఉద్యోగికారి బిడ్డను వివాహం చేసుకుంటానంటే వాళ్ళ పెద్దలు ఏమాత్రం అంగీకరించరు. కాబట్టి బాగాఆలోచించు.

రాణీ:- అలాగే నాన్నా! బాగాఆలోచించి నీ యిష్ట ప్రకారమే చేస్తాను.

తెరలో-(రెండవైపు) రవి:- పిచ్చిదానా! ఎవరోనీకు మోసం చేస్తారని చెప్పినంత మాత్రాన నువ్వెలా నమ్మావ్! చేసుకున్న ప్రమాణాలు మరచావా? జీవితాంతం వరకూ నిన్ను నాఅర్ధాంగిగా స్వీకరిస్తానన్నది మరచావా? కడుపు కన్నతండ్రిమాట కాదనలేక......

రాణి:- రవీ!

తెరలో-రవి:- ఏం! కోపమొచ్చిందా?

రాణి:- లేదు. క్షమించు రవీ! ప్రళయం వచ్చినాసరేచేసుకున్న ప్రమాణం తప్పనని మరోసారి మాటిస్తున్నాను.

తెరలో రవి:- రాణీ!

రాణి:- రవీ!

(భాను లోని నుంచి వస్తాడు)

భాను:- ఏం రాణీ! ఏమాలోచించావ్?

రాణి:- ఏమిటాలోచించేది?

భాను:- అందంగావున్న నాలుగురోజులే పుష్పాన్ని పదిమందీ కోరేది. తరువాత నలిగిన పుష్పాన్ని ఏంచేస్తారు ?

రాణి :- పారేస్తారు -

భాను:- అప్పుడు నీ గతీ అంతే అవుతుంది.

రాణి :- అయినా సరే! నిన్ను నేను ప్రేమించటం లేదు. మామయ్యా! జీవించిన నాలుగురోజులూ ప్రేమించిన ప్రియుడితోనే సుఖించాలి. తరువాత ప్రాణంపోయినా నా కిష్టమే !

భాను:- అదే ఖాయమా ?

రాణి :- ముమ్మాటికీ అదే ఖాయం. (లోనికి వెళ్తుంది)

భాను:- [ఏమీ తోచక అటూ-యిటూ తిరుగుతూ సిగరెట్టు కాలుస్తూ కుర్చీలో కూర్చుని ఆలోచిస్తుంటాడు]

తెరలో-ఆత్మ : (నవ్వు) పిచ్చివాడా ! ఎందుకలా ఆలోచిస్తావ్!

భాను:- అంతకంటే ఏంచేయను ?

తెరలో-ఆత్మ : అవును. పాపం ! ఏం చేయగలవ్ ! నువ్వు ఆమెను ప్రేమించావు. ఆమె మరొకరిని ప్రేమించింది. ఆ ఫలితం అతనికి దక్కింది. నీకు దక్కలేదు. అదే జీవితాలలోవున్న పరమార్థం - ఒకళ్ళ సుఖం కోసం మరొకళ్ళు నాశనం కావాలి —

భాను:- అంతేనా ?



తెరలో-ఆత్మ : అంతే! చిన్నప్పటినుండీ పెంచి, పెద్దదాన్ని చేశావ్. అంతవరకే నీపని. ఇప్పుడు నువ్వు బలవంతాన వివాహం చేసుకున్నా నువ్వు సుఖించేది లేదు.

భాను:- మరేమిటీ దారి?

తెరలో-ఆత్మ : 'వాళ్ళ సుఖానికి అడ్డు తొలగించటం మంచిది-

భాను:- అంటే!

తెరలో-ఆత్మ : వాళ్లు సుఖంగావుండాలంటే నువ్వు అడ్డంకదూ!

భాను:- ఎందుకని?

తెరలో-ఆత్మ : నీవు ప్రేమించిన యువతి మరొకరితో సరస సల్లాపాలాడుతుంటే నువ్వు చూచి సహించగలవా?

భాను:- నా జీవితాంతం వరకూ సహించలేను. అలా జరిగితే దాని ప్రాణం తియ్యనూ!

తెరలో-ఆత్మ : (నవ్వు) కాబట్టి నువ్వు వాళ్ళ సుఖంకోరి తక్షణం యిల్లు విడచి వెళ్లటం మంచిది.

భాను:- ఆఁ! ...

తెరలో-ఆత్మ : అంతకంటే వేరే మార్గంలేదు - లే! వెళ్లూ!

భాను:- (జేబులో నుండి కలం, కాగితం తీసి వ్రాస్తుంటాడు)

(తెరలో - పాట)

అయిపోయినదా

భారత యువకా!



నీ ఆశలన్నీ నిరాశలేనా
కష్టనష్టముల కోర్చిన నీకు
కటిక చీకటే శరణమా
భగ్నజీవులను ఫలితంబింతే
ఒకరికొరకు నాశనమైతే
ముగియునా జీవితమూ !!

(పాటయ్యేటప్పటికి ఉత్తరం పూర్తిచేసి బల్లమీద పడేసి బాధగా వెళ్ళిపోతాడు. రాణివచ్చి ఎక్కడికి వెళ్ళాడా అని చూస్తుండగా బల్లమీద ఉత్తరం కన్పిస్తుంది. గాబరాగా చూస్తూవుంటుంది. లోపల భాను ఉత్తరం చదవాలి—)

తెరలో-భాను : రాణీ! నమస్తే! ఉత్తరం వ్రాసింది ఫలానా అని ముందు తెలియకపోయినా అంతిమకైనా అర్థం కాకమానదు. నీ తల్లిదండ్రులు నా చేతిలో పెట్టి పోయిన నాటినుండీ ఎంతో ప్రేమగా పెంచి పెద్దదాన్ని చేశాను. నీ గురించి నే నెన్నో వూహాసౌధాలు నిర్మించుకున్నాను. ఎన్నెన్నో తీయటి కలలు కన్నాను. అన్నీ యీనాటితో తీరిపోయినై. నా ఆశాసౌధాలు నేలకూలినై. అన్నింటికీ కారణం ... ...? నువ్వే! యీనాటికి నా ఆశలన్నీ నిరాశలేనని నిర్ధారణయ్యింది. నిన్ను చేతులారా మరొకరిచేతులో పెట్టలేక, నీ ఆనందానికి అడ్డురాకుండటానికి నిన్ను వదలి వెళ్తున్నాను.

కాని - ఒక్కటిమాత్రం గుర్తుంచుకో ! నమ్మించినవాని చేత మోసగింపబడక నీ జీవితం హాయిగా గడుపు. నా కోసం వెతకటం అనవసరం. నేనెక్కడున్నా నీ వాడినే! కాని... నీవుమాత్రం నా దానివికాదు. సుఖంగా జీవితాన్ని వెళ్ళబుచ్చు. ఇక్కడికే చాలా శ్రమిచ్చాను —

ఎల్లప్పుడూ నీ మేలుకోరే అభాగ్యుడు
నీ మామయ్య -
— భాను.

(ఉత్తరం పూర్తయ్యేటప్పటికి రాణి కళ్ళవెంబడి రెండు కన్నీటి బిందువులు రాల్తై. ఉత్తరం బల్లమీద పడేసి బాధగా "మామయ్యా" అంటూ బల్లమీద వాలిపోతుంది. బాబు - వస్తాడు)

బాబు;- రాణీ ! రాణీ !

రాణి:- (లేచి కళ్ళుతుడుచుకుంటూ వుంటుంది)

బాబు:- ఏమిటమ్మా అలాగున్నావ్ ?

రాణి :- ఏమీలేదండీ. తలనొప్పిగావుంది.

బాబు:- మీ మామయ్య ఏమిటీ అలాతిరుగుతున్నాడు ?

రాణి :- ఎక్కడ ?

బాబు:- బజారులో నిలబడివున్నాను. షుమారు ఒక పదిసార్లు ఆరోడ్డువెంట పిచ్చోడిలాగా గిరగిరా తిరుగుతున్నాడు.

రాణి :- పిచ్చోడే అయ్యాడు. అలా అవ్వటానికి కారణం ... నేను. నామూలంగానే అతను నాశనమయ్యాడు.

బాబు:- ఏంజరిగింది ?

రాణి:- ఇదిగో (అంటూ ఉత్తరంఇస్తుంది)

బాబు:-(అందుకునిచదువుతాడు) అరే! నేను తీసుకువస్తానుండు. (వెళ్ళబోతాడు)

రాణి:- ఆయనరాడు. ప్రయత్నించినా మాటపోవటం తప్ప ఫలితం లేదు. ఆయన పట్టుదలే పట్టుదల.

బాబు:- సరే! (కాగితాలు యిస్తూ) యీ పోర్షన్ చదువుకుని సాయంత్రం రిహార్సల్సుకి రమ్మని చెప్పమన్నాడు రవి.

రాణి :- అలాగే. (అంటూ తీసుకుంటుంది)

బాబు :- నేను వెళ్లొస్తాను.

రాణి :- మంచిది.

బాబు:- (వెళ్తాడు)

— తెర వ్రాలును —

# సమాధి

## 3వ రంగము



## "ఇల్లరికం"

ఈ నాటికలో —

రవి: వయస్సు మామూలే. మాసిన పైజమా, లాల్చి రేగిన జుట్టు.



బాబు: వయస్సు షుమారు 40 సం॥లు. నల్లకోటు, పంచి, కండువా, చేతికర్ర.



రాణి: జార్జెట్టు, సిల్కు-చీర, లెదర్ బాగ్.



[ పై విధంగా పాత్రలను మార్పుచేయాలి. నాటిక మొదలు పెట్టేముందు మైక్‌లో "ఇల్లరికం" నాటిక. ఇందు పాల్గొనువారు రవి, రాణి, బాబు. రచన, దర్శకత్వం : రవి ] అని చెప్పాలి.



[తెర లేచేసరికి సమయం: ఉదయం షుమారు 8 గంటలు. అది ఒక లక్షాధికారి భవనం. 2 సోఫాలు, ఒక టేబిల్, దానిపైన పూలకూజా, రేడియో అలంకరించి వుంటై. గోడకు గాంధి, నెహ్రూ, రాణి, రవి ఫోటోలు తగిలించివుంటై. రేడియోలోనుంచి "ఎవరు చేసిన ఖర్మ" అను తత్వం వినిపిస్తూంటుంది. రవి పాతగుడ్డతో బల్లలు దులుపుతుంటాడు. రాణి చలవకళ్ళజోడు పెట్టుకుని చేతిలో లెదర్ బ్యాగ్‌తో అట్టహాసంగా వచ్చి రవిని పలికించకుండానే మాట్లాడుతూంటుంది]

రాణి :- ఇంకా సర్దటం కాలే! యీ వేళవచ్చే స్నేహితులు లక్షాధికార్లు. (సోఫాలో కూర్చొని పేపరు చూస్తూ) ఈరోజు టీ పార్టీకి వెరైటీస్ ఏమేమిచేయాలో తెలుసా? స్వీట్, హాట్, టి - నీట్‌గా అరేంజిచేసి హోటల్ నుంచి పట్టుకురా! ఏం? నా కోసం యెవరన్నా వచ్చారా?

రవి :- మీ భర్తగారే వచ్చి ఎక్కడికి వెళ్ళారని అడిగారండి.

రాణి :- దేనికీ అజ? ఎక్కడికో పనుండి వెళ్ళిందని చెప్పలేకపోయావ్.

రవి :- చెప్పానండి -

రాణి:- రోజూ రాగానే కాఫీ యిచ్చేవాడివి యీ రోజు తేలేదేం? కాయలేదా?

రవి :- లేదు.

రాణి :- ఏంలేదు?

రవి :- కాఫీ కాయలేదు.

రాణి:- ఎందుకని ?

రవి :- చేతకాక.

రాణి :- ఏం ? రోజూ చేతనయ్యేది యీ రోజు కాలేదా ? నిన్ను యెందుకు పోషిస్తున్నాం ? మా నెత్తిమీద యెక్కడానికా ? తేరగా తినేవాళ్ళులేక నిన్ను మేపుతున్నా మనుకున్నావా ?

రవి :- మాటలు జారవిడవటం మంచిదికాదు.

రాణి :- (కోపంగా) నన్నే ఎదిరిస్తావురా రాస్కెల్ ! (కొట్టబోతుంది. రవి తలెత్తి చూస్తాడు. రాణి నిర్ఘాంతపోయి అలాగే చూస్తూ...) మి... మి... మీరా !

రవి :- అవును నేనే !

రాణి :- పని చేసేవాడనుకున్నాను -

రవి :- అనుకున్నా ఫరవాలేదు.

రాణి :- అంత మాటెందుకు లెండి. వాడు రాలేదా ?

రవి :- వాడి భార్యాకు సుస్తీగావుంది రాలేనని చెప్పివెళ్ళాడు. నీ స్నేహితులతో వస్తావని రాత్రి చెప్తుంటే విన్నాను. అందుకే నీ పనికి ఆటంకం రాకుండా నేను సర్దుతున్నాను.

రాణి:- మీకా శ్రమవసరం లేదు. లోనికివెళ్లి దుస్తులు మార్చుకోండి.

రవి :- ఏం? యిలావుంటే కాదంటారా?

రాణి:- ఒకరనేదేమిటీ? నాకే నామర్దా!

రవి :- అలాగయితే పనిచేసేవాడని చెప్పు. నాకు నామర్దా లేదులే.

రాణి:- అంతేగాని నేను చెప్పినట్టు చెయ్యరన్నమాట?

రవి :- నా అంతరాత్మకు విరుద్ధంగా నేను నడవలేను.

రాణి :- అని ఖచ్చితంగా చెప్తున్నారా?

రవి :- చెప్పటంలో కూడా రెండు రకాలున్నా యేమిటీ?

రాణి :- వున్నై.

రవి :- అయితే అవునని ఖచ్చితంగానే చెప్తున్నాను.

రాణి :- అలా చెప్పటానికి మీ కధికారం లేదు.

రవి :- అంటే అర్థం కాలేదు.

రాణి:- అర్థం ఎందుకవుతుందీ!

రవి :- అంటే?

రాణి:- అంటే మీరు నాకు బానిస.

రవి :- ఆఁ !

రాణి :- అవును. మీరు అస్వతంత్రులు. నా యిష్టా అయిష్టాల ప్రకారం నడవాల్సిన బాధ్యత మీ మీదుంది.

రవి :- ఎందుచేత?

రాణి :- తెలిసే అడుగుతున్నారా?

రవి :- తెలిస్తే అడగాల్సినంత అవసరం లేదు. నువ్వన్నమాటలు అర్థం చేసుకోలేక బాధపడుతూ నిజం చెప్పమని అర్థిస్తున్నాను.

రాణి :- మీ తండ్రి మిమ్మల్ని ఏవిధంగా నాకిచ్చి వివాహం చేశారో తెలుసా ?

రవి ;- (తెలియనట్లు తలూపుతాడు)

రాణి :- చిన్ననాటినుంచీ పెంచి పెద్దచేసి బి. ఏ. చదివించినందుకుగాను నిన్ను లక్ష రూపాయలు ఖరీదుకట్టి నాకు మీ నాన్న అమ్మాడు. నీకు లక్ష రూపాయల కట్నం యిచ్చి మా తండ్రి నిన్ను నాకు వివాహం చేశారు. అందుకే నువ్వు నాకు బానిసవు! అస్వతంత్రుడవు! (లోనికి వెళ్తుంది)

రవి ;- (అయోమయంగా చూస్తుంటాడు)

(తెరలో పాట)

ఓ బానిస యువకా
నీ బ్రతుకే భారమాయెనా



పాలుపోసిన తండ్రే నీకూ
మోసము చే జూచెనుగా
యీ లోకమంతా మోసం
మన జగమంతా ద్రోహం
కలియుగమంతా కపటమేనోయ్ ॥

రవి :- అవును జగమంతా మోసం! వెధవ కట్నానికాసించి కన్నతండ్రి కఠోరంగా ప్రవర్తిస్తే లక్ష రూపాయలు వెచ్చించి కొన్న వీళ్లెందుకు కనికరించాలి? కట్నం తీసుకుంటే పెళ్లే వద్దన్నానని ఈ విధంగా తలపెట్టారా? (బాధగా) అవును బానిసనే! నా యావజ్జీవితం బానిసత్వానికే గురిచేశాడు నా తండ్రి. నేను ఆవిడచేతుల్లో కీలుబొమ్మని. పేరుకు మాత్రం భర్తను. అంతే! చెప్పింది నెరవేర్చటం నా విద్యుక్తధర్మం.

[అంతరాత్మ ఘోష వినిపిస్తుంది]

ఆత్మ : అవును అదే నీ ధర్మం! నీ శరీరమంతా కృంగి కృశించి క్షీణించిపోయేటట్లు రేయింబవళ్ళు శ్రమించి డిగ్రీ సంపాయించావ్! తుదకు యిదేనా ప్రతిఫలం! నీ ఆశయాలు నాశనం చేసుకుని నీ యావజ్జీవితం యీ కారాగారవాసానికి బలి చేస్తావా?

రవి :- అంతకుమించి చేసేదేమీ లేదు.

ఆత్మ : ఎందుకుంటుంది. నీ తండ్రి నిన్ను అమ్మాడు! ఇల్లరికపు టల్లుడుగా స్వేచ్ఛగా జీవిస్తావని మోసగించాడు! యిల్లరికం అంటే అర్థం చేసుకోలేక నీ జీవితాన్ని వాళ్ళకు అమ్మాడు.

రవి :- ఆఁ! నా తండ్రి నా సుఖంకోరి ఈవిధంగా చేశాడా... లేక డబ్బుకాసించాడా?

ఆత్మ :- డబ్బు కాసించాడని యెందుకనుకోవాలి? సదుద్దేశ్యంతోనే సరిపుచ్చుకోవటం మంచిది.

రవి :- యిప్పుడేం చెయ్యను ?

ఆత్మ :- ఏంచెయ్యటానికీ నీవొక బానిసవు. వారి ఆజ్ఞప్రకారం నడవాల్సిన బాధ్యత నీ మీదుంది. అందుకే నువ్వు స్వతంత్రించి ఏ పని చెయ్యలేవు! చెయ్యజాలవు!

రవి :- యిప్పుడేమిటీ దారి?

ఆత్మ :- నీ ఆశయాలు నాశనం చేసుకుని బానిసగా జీవిస్తావా?

రవి :- లేదు. జీవించ లేను.

ఆత్మ :- అయితే ఏంచేస్తావ్ ? నువ్వు ఏంచేయటానికీ అస్వతంత్రుడవు.

రవి :- ఇప్పుడేంచేయను ?

ఆత్మ :- (నవ్వి) అమాయకుడా! అందుకే నీ తండ్రి నీకు తెలియకుండా నీ జీవితం నాశనం చేశాడు. అందుకు ప్రతి



ఫలంగా నీవీ ఇల్లరికపు బ్రతుకు బ్రతకగలవా! లేవు...
బ్రతకలేవు. కాబట్టి నీకు ఒక్కటే దారి! మళ్ళీ తిరిగి
రాని దారి! కష్టాలులేని దారి! ప్రాణత్యాగం!

రవి :- అవును. అంతే! యీ బానిస బ్రతుకుకంటె మరణమే
మేలు.

రాణి :- (లోనినుంచి వచ్చి) స్నేహితులెవరైనా వస్తే కూర్చో
మను. (బయటకు వెళ్తుంది)

రవి: - (అయోమయంగా అటూయిటూ తిరిగి డస్కులో
నుంచి కాగితం కలం తీసి వ్రాస్తుంటాడు)

ఆత్మ :- ప్రాణత్యాగమే శరణ్యం! మరణమే మేలు! ప్రాణ
త్యాగమే శరణ్యం! మరణమే మేలు!

(తెరలో పాట)

అంధకారమురా ఆంధ్ర యువకా
అంధకారమురా గాఢాంధకారమురా
ఎందు జూచినగాని బ్రతుకే భారమై
తల్లిదండ్రుల ధనాపేక్షకై బలైపోయెదవా
ఇంతేనా ఇల్లరికపు బ్రతుకింతేనా
మరణమే మేలా! మరణమే శరణ్యమా !!

(రవి ఉత్తరం డస్కుమీద పెట్టి లోనినుంచి పిస్టల్ తీసుకుని కాల్చు
కుంటానికి ప్రయత్నిస్తుండగా లోనినుండి తండ్రి, ఆత్మ మాటలు వినిపిస్తూ
వుంటై)

తండ్రి : ఆగు ! మతి చలించి మరణానికి ఆహుతౌతున్నావా?

ఆత్మ : మరేం చెయ్యాలి ?

తండ్రి : ఏంచెయ్యలేనంత మాత్రాన చేతిలో పనిగదా అని ఆత్మహత్యకు ఒడిగడ్తావా ?

ఆత్మ :- బ్రతికుండికూడా చచ్చినవాడిలాగా సంచరించలేకే యీ పనికి పూనుకున్నాను.

తండ్రి : అంత అవసర మేమొచ్చింది ?

ఆత్మ : స్వేచ్ఛగా స్వతంత్రం లేని యీ బానిస బ్రతుకుకంటే మరణమే మేలని నా నిర్ణయం !

తండ్రి : బాగా ఆలోచించే చేస్తున్నావా?

ఆత్మ : ఇంతకంటే ఆలోచించాల్సిం దేమీలేదు. యిదే నా అంతిమ నిర్ణయం !

(ఒక ప్రక్కనుంచి నవ్వు, మరోప్రక్కనుంచి "మరణమే మేలు" అను మాటలు 5, 6 సార్లు వినిపిస్తై. రవి అయోమయంగా అటూ యిటూ చూచి ఏమీ తోచక చేతిలోవున్న పిస్టల్ తో కాల్చుకుని పడిపోతాడు;

— తెరలో - పాట —

యిదేనా యిల్లరికపు బ్రతుకూ
రేయనక పగలనక ధారవోసిన
చెమట బిందువులతో నార్జించిన

విద్యాదేవికి ప్రతిఫలంబిదేనా
ఓ ఆంధ్ర యువకా! బానిస జీవి!!

(రాణి బయటనుండి వస్తుంది. అకస్మాత్తుగా పరిస్థితులు పరిశీలిస్తుండగా రవి వ్రాసిన ఉత్తరం దొరుకుతుంది. అది విప్పి చూస్తూండగా లోనినుండి ఉత్తరం వినిపిస్తుంది)

రాణీ! నమస్తే!

నేను చదువుకునే రోజుల్లో ఎంతమంది యువతులు నన్ను తమ వశంచేసుకుందామనుకున్నా వాళ్ళవశం కాలేక పోయాను. మా తండ్రిమాటలువిని నిన్నువివాహం చేసుకున్నాను. మన యిరువురం కలసి ఎంతో అనురాగంగా జీవించగలమని గాలిమేడలు కట్టుకున్నాను. మీ యింటికి వచ్చిన మూడవ రోజునే నా వూహాసౌధాలు నేల కూలినై. నాఆశలు నిరాశలైనై. నాజీవితంనాశనమైంది ఇన్నింటికీ కారణం... నువ్వు. నువ్వు నన్ను ఏవిధంగా చూశావో గుర్తుతెచ్చుకో! భర్తనే భావంలేకుండా బానిసకదా అని పనిచేసే కూలివానికన్నా అన్యాయంగా చూశావ్! దేశంలో యిల్లరికం ఉన్నవాళ్ళందరి గతీ యింతేనా? క్షమించు. తప్పంతా మాదే. ధనాని కాసించి కన్నకుమారుని యిల్లరికానికి ఒప్పుకున్న నా తండ్రిది. నా జాబు చూచి బహుశా వారుకూడా మీ డబ్బుతో

యీరోజునే మీవద్దకు రాగలరు. వారు మీ ఋణాన్ని బాపుకోగలరు... నమస్తే!

మీ

ప్రియుడు ... కాదు, కాదు -

మీ బానిస 'రవి'.

(ఉత్తరం పూర్తయ్యేటప్పటికి రాణి కళ్లు చెమ్మగిల్లినై. బయటనుండి బాబు వచ్చి రవి శవాన్ని చూచి గాబరాగా 'రవీ' అంటూ శవం దగ్గర కూర్చుని ఏడుస్తుంటాడు.)

బాబు :- రవీ! రవీ! నాయనా! ఇంత ఘోరానికి తల పెట్టావా బాబూ! (రాణిని గంభీరంగా చూస్తూ) ఏవమ్మా! లోకంలో యిల్లరికమున్న భర్తలందర్నీ తమ భార్యలు యీ విధంగానే చూస్తారా? అలా అనుకుంటే మావాణ్ణి మీ యింటికి పంపేవాణ్ణే కాదు. (లేచి) యిదిగో మీ డబ్బు (డబ్బుసంచి కాళ్ళ దగ్గర పారేస్తాడు) దీనికోసమేగా మావాడి ప్రాణం తీసింది! నా కుమారుని గొంతుకోసిన ధనం తీసుకో! నీ ఋణం తీరిందిగా! నీ ధనానికి వడ్డీగా నా కుమారుడు ప్రాణాలిచ్చాడు! చాలా? యిప్పటికైనా తృప్తి తీరిందా? యికనుంచైనా సుఖంగా వుండు.

(బాబు 'రవి' ని రెండు చేతుల్లోకి యెత్తుకుని అయోమయంగా చూస్తూ వీధివైపు వెళ్తాడు. తెరలో మాటలు వినిపిస్తుంటై. రాణి జరిగిం దానికి పరితపిస్తూ పిస్టల్ చేతితో తీసుకుని అయోమయంగా చూస్తుంటుంది)

తెరలో: (నవ్వు) పిచ్చిదానా! ఇకనుంచైనా సుఖపడు! భర్తంటే అంత నీచంగాచూసే భారత నారీమణుం టుందా యీ లోకంలో! నీకోసమేగా అతను ప్రాణాలు విడచింది! పౌరుషం కలవాడు కాబట్టే నీ నీచపుపనులు చూచి సహించలేకే ప్రాణత్యాగం చేశాడు. వెళ్ళు! అతని ఆత్మశాంతికిగాను నీ ప్రాణాలు బలియిచ్చి అతని ఋణాన్ని బాపుకో! వెళ్లు! వెళ్లు! (అక్కడవున్న పిస్టల్‌ను తీసి ఏమీాలోచక కాల్చుకుని పడిపోతుంది)

— తెర వ్రాలును —

తెరలో: "ఇల్లరికం" నాటిక యింతటితో సమాప్తం.

# సమాధి

## 4వ రంగము



(లక్షాధికారి రావుగారి భవనం. గోడకు దేముళ్ళఫొటోలు, రావుగారి ఫొటో, ఆయన భార్యఫొటో, రవి ఫొటోలు అలంకరించివుంటై. రవి సోఫాలో కూర్చుని రాసుకుంటూంటాడు. రేడియోలో నుంచి సన్నగా "వాడు పలికినా మాటలనే మరచినాడటే చెలియా" అన్న రికార్డు వినిపిస్తూంటుంది. లోని నుంచి రావు ప్రవేశిస్తాడు)

రావు:- ఏరా రవీ ఎప్పుడొచ్చావ్ ?

రవి :- చాలసేపయ్యింది.

రావు:- మరి రాత్రి ఎక్కడున్నావ్ ?

రవి :- నాటకం అవ్వగానే అంతావెళ్ళి రూమ్ దగ్గర పడుకున్నాం.

రావు:- యింత పెద్దకొంప వుండికూడా నీకేం ఖర్మంరా?

రవి :- అదేమిటి నాన్నా!, నాటకం ప్రదర్శించ-పూ ... దానిలోని మంచి-చెడ్డ లన్నీ విమర్శించుకుంటూ రూంలో పడుకున్నాం.

రావు:- అయితే ఎంతకాలం యిలా నాటకాల్లో తిరగటం !

రవి :- అంటే ?

రావు :- ఇలా ఎన్నాళ్ళు వుల్ఫా జీవితం గడుపుతావని ?

రవి :- యీ జీవితానికేం నాన్నా ! నాటకాలు వ్రాసుకుంటూ - ప్రదర్శన లిచ్చుకుంటూ - విమర్శించుకుంటూ జీవిస్తుంటే ఎంత ఆనందంగా వుంటుంది?

రావు:- అంతేగాని కష్టపడి చదువు చెప్పించినందుకు ప్రతిఫలంగా వుద్యోగం చెయ్యానన్న మాట ?

రవి :- నాన్నా ! అధికారుల అడుగులకు మడుగులొత్తే బానిస జీవితం నేను గడపలేను.

రావు:- అయితే ఏంచేస్తావ్ ?

రవి :- ఇలాగే కళారంగంలో నా జీవితం సార్థకం చేసుకోటానికి ప్రయత్నిస్తాను.

రావు:- ఊఁ! సరే! ఆ విషయం అలావుంచు.యిక్కడికే పెళ్లీడు వచ్చింది. అందుకు పెళ్లి చేసుకుని నీ యిష్టప్రకారమే నడుచుకో !

రవి :- పెళ్లా! అప్పుడే నాకువద్దు.

రావు:- ఎందుకని ?

రవి :- పెళ్ళి చేసుకున్నకాడనుండి పిల్లలు పుడతారు. వాళ్ళను పోషించుకునే తాహతులేందే పెళ్ళి చేసుకున్నంత బుద్ధి తక్కువ యింకోటి లేదు.

రావు:- నువ్వు సంపాయించుకోవాల్సిన అవసర మేమొచ్చింది? రోజుకి వందమందిని పోషించినా తరగని ఆస్తి సంపా



యించివుంచాను. ఇదుగో యీ భవనం, ఆ భూములు, ఆ బంగళా అంతా నీది. నీ కోసమే సంపాయించాను. పెళ్ళి చేసుకుని సుఖంగా కాపురం చేసుకుంటూ హాయిగా జీవించు.

రవి :- అదేమిటి నాన్నా ! యింత బ్రతుకూ బ్రతికి యింటి వెనకాల చచ్చినట్లు, యింత చదూవ్వూ చదివి యీ విధం గానా నేను జీవించాల్సింది ?

రావు:- ఏం ?

రవి :- చెమటోడ్చి కష్టపడి సంపాయించి జీవించేదానికి నువ్వు చెప్పినదానికి చాలా తేడావుంది నాన్నా !

రావు :- అయితే ఏమంటావ్ ?

రవి :- ప్రస్తుతం పెళ్ళిచేసుకోను. నా జీవితానికి సరిపడ నేను సంపాయించుకో గలిగిననాడు నేను కోరిన యువతిని తెచ్చుకుని మీ యిష్టప్రకారమే వివాహమాడి ఆనం దంగా జీవిస్తాను.

రావు :- (ఆశ్చర్యంగా) ఏమిటీ ! నువ్వు కోరిన యువతినా ?

రవి :- అవును నాన్నా ! నీ యిష్టప్రకారం పెళ్ళి చేసుకుంటే ఏం లాభం ? జీవితాంతం వరకు కష్టసుఖాలు పంచు కొని జీవించేది మేముగాని మీరుకాదుగా !

రావు:- బాగానేవుంది ! ఇంత కష్టపడి చదువు చెప్పించినందుకు ప్రతిఫలంగా నాకే చదువు నేర్పుతున్నావ్ ! అయితే మన కులం పిల్లనే పెళ్ళి చేసుకుంటావా ?



రవి :- ఏ కులమైతే ఏం? మనస్ఫూర్తిగా ప్రేమించుకుని పెళ్లి చేసుకున్నంత సుఖం లేదు.

రావు:- (వ్యంగ్యంగా) అంతేనా! నాలుగు రోజులు కాపురం చేసిన తరువాత ఆలోచించినంత ఆనందం లేదేమో!

రవి :- ఏమిటి నాన్నా!

రావు:- లేకపోతే ఏమిట్రా! మన కులం పిల్లను పెళ్లి చేసుకుంటాననక ఏ కులమైతేనేం అంటావేమిటిరా?

రవి :- అవును నాన్నా! ప్రేమకు కుల మత జాతి విచక్షణ లేదు.

రావు:- ఇదిగో! నేను చెప్పేమాట విను. ఈ యింట్లో వున్నంత కాలం నా యిష్టప్రకారం ఖచ్చితంగా ఒప్పుకుతీరాలి.

రవి :- ఏ విషయంలో?

రావు:- అన్ని విషయాల్లోనూ!

రవి ;- అలా జరగదు నాన్నా!

రావు:- ఏం?

రవి :- నేనొక యువతిని మనస్ఫూర్తిగా ప్రేమించాను. ఆవిడ కూడా నన్ను అలాగే నమ్మింది. ఇద్దరం ప్రమాణాలు చేసుకున్నాం కూడాను.

రావు:- ఏమని?



రవి :- వివాహము చేసుకుంటామని.

రావు:- మీ యిష్టమేనా ?

రవి :- కాదుకాబట్టే యింతకాలం ఆగాల్సివచ్చింది. యిప్పటి పరిస్థితులనుబట్టి చెప్పక తప్పటంలేదు.

రావు:- ఎవరాయువతి ?

రవి :- మొన్న నాటకంలో నాప్రక్కన వేషంవేసినామే.

రావు:- ఆఁ ! నాటకాలు వేసేపిల్లనా ? ఏంకులం ?

రవి :- మన కులంమాత్రం కాదు.

రావు:- మనకులంగాన్ని పిల్లనా !

రవి :- అవును.

రావు:- అవునట్రా! యింకా సిగ్గులేకుండా మాట్లాడుతున్నావ్!

రవి :- నాటకాలలో తిరిగినంతమాత్రాన అంత తేలిగ్గా మాట్లాడకూడదు. సిగ్గుదేనికి ?

రావు:- ఎందుకేమిట్రా ! కాలికి గజ్జకట్టి నడివీధిలో కన్నుకొట్టే సానిదానినా నువ్వు చేసుకునేది. ఇదేనా మనగౌరవం !

రవి:- అసలువాళ్ళు కులానికి భోగంవాళ్ళుకాదు. కానియదార్థం ప్రపంచంలో ఎంతమంది ధనవంతుల భార్యలు భర్తల కళ్ళుగప్పి పరపురుషులతో కులకటంలేధు. పైకి అంతా పతివ్రతలే !

రావు:- నోర్మూయ్ !

రవి :- నిజంచెప్పాలంటే వాళ్లలో ఉండే పతివ్రతలు మనలో కూడా లేరు.

రావు:- ఈనాటికి సంపాయించావులేవోయ్! మహా పతివ్రతను. డబ్బుగుంజుకోడానికిదోమార్గం. పూర్తిగా తమను అరి పోయిన తరువాత ఇంకొకరితో పవిత్రంగా ఉంటారు. ఇంతేగా! కాలచక్రం ఇల్లాగే దొర్లిపోతూ వుంటుంది. ఇంకో విషయం చెప్తున్నా! అప్పుడు మనను పిల్లనిచ్చే వాళ్ళుకూడా వుండరు. ఏపని చేసినా పెద్దవాళ్ళతో ఆలోచించి చెయ్యాలిరా !

రవి :- దేనికి ?

రావు:- దేనికా ? యింకా బుద్ధిలేకుండా అడుగుతున్నాడు చూడండి. ఇదిగో అబ్బాయ్! ఒక్కమాట చెప్తున్నాను విను.

రవి:- ఈ విషయంలోమాత్రం వినలేనునాన్నా! మనస్ఫూర్తిగా ప్రేమించాను. మనసిచ్చాను, మనసు పుచ్చుకున్నాను. ఎంతో అన్యోన్యంగా జీవితం గడుపుతున్నాం. అలాంటి మా ప్రేమలతను త్రుంచివేసి మా జీవితాలను నాశనం చేయటం మంచిదికాదు.

రావు:- నోర్మూయ్ ! మన పరువుప్రతిష్ఠలుకూడా కాస్త గమ. నించాలి. సరసులకు సాన్నిధ్యమిచ్చి సంపాయించుకునే సానులతోనా సరసాలు ?

రవి :- ఆవిడ సానికాదు, యివి సరసాలుకావు నాన్నా ! అందరి హృదయాలు ఒక్కటిగా వుంటాయా ?

రావు:- నీ పిచ్చిపిచ్చి వ్యవహారాలుమాని చెప్పింది చెయ్యటానికి సిద్ధంగావుండు.

రవి :- ఏవిషయంలోనైనా చెయ్యటానికి సిద్ధంగా వున్నాను. కాని......

రావు:- కాని ?

రవి :- ఈ విషయంలోమాత్రం చెయ్యలేను....

రావు:- (గంభీరంగా) రవీ ! కుర్రతనంలో ప్రాకులాడుతున్నావ్! నీలాంటివాళ్లు ఎంతమందో వాళ్లకు. ఒక్కసారి ఆలోచించు.

రవి :- పొరపాటునాన్నా !

రావు:- ఏమిటీ ?

రవి :- వాళ్లనలా తూలనాడటం ఎందుకు. కళమీదుండే అభిమానంతో నాటకాలతో దిగింది. యింత మాత్రాన గుణానికి అవినీతివంతురాలవ్వాలని ఎక్కడుంది ?

రావు:- ఏమైనాసరే నేను బ్రతికుండగా ఆ వివాహానికిమాత్రం ఒప్పుకోను.

రవి :- నాన్నా ! తొందరపడుతున్నారు ?

రావు:- ఎవరు ?

రవి :- మీరు !

రావు:- కాదు

రవి :- అవును.

రావు:- అష్టకష్టాలుపడి కని పెంచిన తల్లిదండ్రులు తమ కుమారుని మంచి చెడ్డలుగూర్చి తొందరపడ్డా తప్పులేదు. నా యిష్టప్రకారం నడిస్తేనే నీకీయింట్లో స్థానముంటుంది. లేదా నీదారి నువ్వు చూచుకో. (లోనికివెళ్తాడు)

రవి :- (అయోమయంగా లోనికి చూస్తూవుంటాడు బయట నుంచి బాబు వస్తాడు)

బాబు:- ఏమిట్రా అలా చూస్తున్నావ్ !

రవి :- (తేరుకొని) ఆ! ఏమీ లేదు! కూర్చో!

బాబు :- (కూర్చుంటాడు) మీ నాన్నగారు లేరా ఇంట్లో !

రవి :- వున్నారు.

బాబు :- రాత్రి నాటికనుగూర్చి ఏమన్నారు ?

రవి :- ఏమీ అనలేదు.

బాబు:- ఏమిట్రాలా దిగులుగావున్నావ్! మీ నాన్నగారేమైనా అన్నారా ?

రవి :- అన్నా ఫరవాలేదు.

బాబు:- ఏం చేశారు ?

రవి :- ఖచ్చితంగా నొక్కి వక్కాణించారు.

బాబు:- ఏమని ?

రవి :- రాణీతో సంబంధం వదలుకోవాలట. తోటి కులస్తుల పిల్లని పెళ్లి చేసుకోవాలట.

బాబు:- ఈ విషయం ఎలా తెల్సు ?

రవి :- నేనే చెప్పాను.

బాబు:- ఎందుకు ?

రవి :- నా వివాహ విషయం మాట్లాడుతోంటే చెప్పక తప్పింది కాదు. కాబట్టే చెప్పాను.

బాబు:- అయితే ఏమంటాడు ?

రవి :- ఆవిడతో సంబంధం వదలుకోని పక్షంలో ఈయనతో వొదులుకోవాలట.

బాబు :- మరి ఏమిటీమార్గం ?

రవి :- అదే ఏమీ తోచటంలేదు.

బాబు:- ఈ విషయం ఈలాగుంది. ఇంతవరకూ ఒక్క రిహార్సు కూడా జరగలేదు. ఈ రోజు జనం నూళ్ళేక రాళ్ళే మన్నా ప్రజంటు చేస్తారేమో !

రవి :- మరేం ఫరవాలేదు. ఈ విషయం రేపాలోచిద్దాం. వెంటనే అందర్నీ రిహార్సల్సుకి రమ్మనిచెప్పి రూంకి వచ్చెయ్.

బాబు:- అలాగే! వెళ్ళొస్తాను.

రవి :- మంచిది (రవి లోనికి, బాబు బయటకు వెళ్తారు)

— తెర వ్రాలును —

# సమాధి

## 5వ రంగము



## "సుడిగుండం"



ఈ నాటికలో —

రావు :- బిచ్చగాడు. కుంటికాలు, గుడ్డికన్ను, చేతి కఱ్ఱ, మాసిన గడ్డం, చినిగిన బట్టలు. వయస్సు షుమారు 40 సం॥.



రాణి :- యుక్తవయస్సు. బిచ్చకత్తె. వయస్సు 16 సం॥



బాబు:- ఫుల్ సూటు. డబ్బుగల పోరంబోకు. వయస్సు 25 సం॥.



(పైవిధంగా పాత్రలను మార్పుచేయవలెను. నాటిక మొదలుపెట్టే ముందు మైక్‌లో "సుడిగుండం" నాటిక. ఇందు పాల్గొనువారు - రవి, రాణి, బాబు. రచన, దర్శకత్వం: రవి అని చెప్పాలి.)



(తెర లేచేసరికి సమయం : అర్ధరాత్రి 12 గం॥. ఒక రావిచెట్టు, ఆ చెట్టుకు ఒక వుట్టి వ్రేలాడుతూ వుంటుంది. చెట్టుక్రింద బిచ్చగాడు, అతని కూతురు నిద్రిస్తూవుంటారు. రంగస్థలంమీద లైట్లన్నీ తీసి, ఒకప్రక్క నుంచి ఎర్రటి వెలుగు వారిమీద ప్రసరింపజేయాలి. తెరలో పాట వినిపిస్తూంటుంది.

— పాట —

జీవితమే స్వప్నమురా
అంధకారమే అంధులకు
అవనిలో ఆదర్శంబేనా
ముద్దులతో మురిపెంబులతో
మేడ మిద్దెలలో ముచ్చటగా
మురిసిన మీగతి ఇంతేనా
కలిగినవారే ఒకనాడు
కాలం మారిందీనాడూ
రాజే పేదగమారున్
పేదే రాజుగమారున్
యిదే కాలమహిమా !
యిదే కాలధర్మం !
యిదే కలియుగం ! !

(బాబు చేతిలో కత్తి, నల్ల ముసుగుతో ప్రవేశించి రాణీ కాళ్ళు తట్టి లేపుతూవుంటాడు.)

రాణి:- (గాబరాగా లేచి) నాన్నా ! దొంగ ! దొంగ !

బాబు:- భయంలేదులే దొంగకాదు ! దొరే !



రాణి :- ఆఁ ! ఎవరు మీరు ?

బాబు:- గుర్తుపట్టలేదా ! నేను ! నిన్న సాయంత్రం వీధి వెంట నీవు ముష్టి ఎత్తుతూంటే ఐదు రూపాయలు అందజేశాను జ్ఞాపకం వచ్చిందా ?

రాణి :- ఆఁ ! మీరా ! ఎందుకొచ్చారు ?

బాబు:- ఇప్పుడే కలిసి మంచిచెడ్డ లాలోచించి పోదామని.

రవి :- (లేస్తూ) బాబూ! బిచ్చగాళ్ళ మంచిచెడ్డలాలోచించే ఖర్మ మీకెందుకు ! మా తిప్పలు మేంపడతాం, దయ చేసి మాజోలికి రాకండి (అంటూ లేస్తాడు)

రాణి:- ఈ అర్ధరాత్రిలో ఎవరన్నా చూస్తే ఏమనుకుంటారు ! వెళ్ళండి బాబూ !

బాబు:- ఏమనుకుంటారు! మీ మంచిచెడ్డలు పరామర్శిస్తుంటే వాళ్ళేమనుకుంటే మనకెందుకు ?

రవి :- కాదు బాబూ! లోకం! ఆ లోకాపనిందలకు ఎన్ని జీవులు ఆహుతైపోతున్నాయ్ ! ఏదైనా నిందలకు పాల్పడితే పుల్లో నీళ్లయినా పుట్టవ్ ! దయవుంచి మా జోలికి రాకండి !

బాబు:- ఏయ్ ! ఇలాచూడు ! నేనొక విషయం మాట్లాడు దామని వచ్చాను.

రాణి:- ఏమిటది ? (భయంగా)



బాబు:- గాబరా ఎందుకు. చెప్తాను. ఇదిగో చూడు! బంగారం వంటి కూతుర్ని వుంచుకొని ఇలా వీథులవెంట ముష్టి ఎత్తుకోవటం ఎందుకు ?

రవి :- ఏమిటి బాబు ! మీరాననేది ?

బాబు:- ఆc! ఏమీలేదు ! మీ అమ్మాయికి పెండ్లిచేసి వాళ్ళతో సుఖంగా జీవించవచ్చుగా !

రాశి :- అది ఒక్కటే మాకు తక్కువై యింది.

బాబు:- అంటే పెండ్లి చేసుకోకూడదా ?

రవి :- ఎందుకు చేసుకోకూడదూ! బాబూ చేసే తాహతూ చేసుకొనే దాత వుండొద్దూ !

బాబు:- నువ్వు ఊ... అన్నావంటే ఘడియలో లక్షాధికార్ని మీ అల్లుడుగా చేస్తాను ఏమంటావు !

రాశి :- (నవ్వి) బాబూ ! లక్షాధికారులు మాకెందుకూ ! ఆరోజులు పోయినై ! తాహతునుబట్టి ప్రవర్తిస్తే అంతేచాలు.

రవి :- (విచారంగా) లక్షాధికారి అల్లుడుగా వచ్చేరోజులు చేతులారా నాశనం చేశాను. నా కూతురుని అన్యాయం చేశాను. దాని జీవితం నాశనంచేశాను.

రాశి :- నాన్నా ! పూర్వోక్తిపూ ?

రవి :- పూర్వోక చేసేదేముంది ?



బాబు:- జరిగిపోయిన విషయాలు జ్ఞప్తికి తెచ్చుకొని బాధ పడటం ఏమంత మంచిపనికాదు. నా కోర్కె నెరవేర్చా వంటే లక్షరూపాయలు నీ ఒళ్లోపోస్తాను.

రాణి :- అదా విషయం! కాళ్ళు బలపాలు కట్టేటట్టు తిరిగినా రాగికాని యిచ్చే దాతలేకపోయాడని బాధతో జీవితం మీద విరక్తిపుట్టి నస్తూవుంటే, అయిదురూపాయలిచ్చి మళ్ళా జీవితంమీద ఆశపెట్టారు. ఇంతకాస్వామీ !

రవి :- కులానికి బీదనైనంత మాత్రాన గుణానికి కాలేదులెండి. డబ్బుకాసించి కన్న కూతురు జీవితం నాశనం చేయ మంటారా.! ఇదేనా మీరిచ్చే సలహా ! దయవుంచి దారిపట్టండి !

బాబు:- (కోపంగా) మంచిగా చెప్తేమాటవినేటట్టులేరు. మర్యా దగా నాకోర్కె నెరవేరుస్తారాలేదా? ఐదురూపాయలు తేరగా ఇచ్చాననుకున్నారా ?

రాణి :- బాబూ ! ఇదుగోండి. మీ అయిదు రూపాయలు (అంటూ చీర చెంగునుంచి వూడదీసి ఇస్తుంది)

బాబు:- (తీసుకుని) నా డబ్బు నాకువచ్చింది. వడ్డీగా నీవు నా కోర్కె నెరవేర్చాలి. ఏమంటావ్ ?

రాణి :- మర్యాదగా దయచేయమంటాను.

బాబు:- రా ! ముందు నాకోర్కె నెరవేర్చు. (చెయ్యి పట్టు కుంటాడు)

రాణి :- చెయ్యి వదులు (విదిలించుకుని ప్రక్కకు పారిపోతుంది)

రవి :- (లేచి దగ్గరకువస్తూ) బాబూ! నీకు నా కూతురులాంటి అక్కచెల్లెళ్ళు లేరూ! వాళ్లను రేపెవరైనా ఇలా చేస్తుంటే...

బాబు:- నోర్మూయ్ !

రవి :- (నవ్వి) కాలుజారితే తీసుకోగలంకాని మ్యాటజారితే తీసుకోలేంసుమా ! నాయనా ! నేనూ ఒకనాడు కల వాణ్ణే! లక్షల లక్షలాస్తి నాకళ్ళముందు తులతూగుతూ వుండేది. నేతితో చెయ్యికడిగేవాణ్ణి ! బంగారంతో భోజనం చేసేవాణ్ణి. వేలకు వేలు వెచ్చించి సరదాలు తీర్చుకునేవాణ్ణి. కాగుమీద తప్పితే కాలుక్రింద పెట్టే వాణ్ణికాదు. అలాంటివాణ్ణి ఇలాగయ్యాను కారణ మేమిటి? నీకుమల్లేనే నేనూ బేవార్సుగా తిరిగేవాణ్ణి. అందరికి విరోధినయ్యాను. నీ బ్రతుకూఅంతే అవుతుంది.

బాబు:- షటప్ (చెంపమీదకొడ్తాడు)

రాణి :- ఆఁ! నాన్నా !

రవి :- (చెంప సవరించుకుంటూ వాడిపోయిన నవ్వునవ్వి) ఎంత ఘనకార్యం చేశావ్ ! నేనూ నీ స్థితిలోవుంటే కొట్టే వాడివా? అప్పుడు నీకాధైర్యం ఎలాగుంటుంది. ఇప్పుడో... ...నీవు లక్షాధికారివి, నేను బిక్షాధికారిని. ఏంచెయ్యటానికైనా సమర్ధుడివి.



బాబు:- అందుకే ఒప్పుకోమంటాను.

రవి :- ఏమిటి ?

బాబు:- మీ అమ్మాయి నాతో వుండటానికి అంగీకరించి ఆనందంగా వుంచు.

రవి :- ఈ బొందిలో వూపిరుండగా ఆ పని జరగదు. తక్షణం యిక్కణ్ణుంచి వెళ్ళిపో ! వెళ్ళు! వెళ్ళు ! (అంటూ మీదకెళ్తాడు)

బాబు:- పోరా ! రాస్కెల్ (తోస్తాడు)

రవి :- (క్రింద పడిపోతాడు)

రాణి :- నాన్నా ! (ఏడుస్తూ తండ్రిని లేవదీస్తూంటుంది)

బాబు:- (రాణి చెయ్యిపట్టుకొని లాగుతూ) ముందు నాకోర్క నెరవేర్చు లేకపోతే నీ ప్రాణం తీస్తాను. (అంటూ జేబు లోనుంచి కత్తి తీస్తాడు)

రాణి :- (చెయ్యి విదలించుకొని) నీచుడా! నా ప్రాణాన్నైనా ఇస్తానుకాని నా హృదయాన్ని మాత్రం నీ కివ్వలేను దయవుంచి దారిపట్టండి! లేకపోతే...

బాబు:- లేకపోతే ఏంచేస్తావే...

రవి :- (క్రిందనుంచి లేస్తూ) గెంటుతాను.

బాబు:- ఓరి వెధవా ! క్రిందపడికూడా పౌరుష మెందుకురా !



రాణి:- అవును. మన పౌరుషం కుంటివాళ్ళమీద, గ్రుడ్డివాళ్ళ మీదేగా చూపాల్సింది -

రవి :- మంచిచెడ్డ లాలోచించి పోటానికి వచ్చావుకదూ! పాపం! మేమంటే ఎంతజాలి. ఇదా నీ జాలికి కారణం! దయార్ద్ర హృదయులు కాబట్టి కనికరించి కష్టసుఖాలు ఆలోచించి పోదామని వచ్చారు. ఒహో! పేదవాళ్ళంటే ఎంత జాలి! బీద ప్రజలంటే ఎంత కనికరం! కాము కన్కత్తితో కనికరం చూపడానికి వచ్చారా! కష్టం కల్గించకుండా కాలికి బుద్ధి చెప్పండి.

బాబు:- లేకపోతే!

రవి :- తల బ్రద్దలౌతుంది. (కర్ర ఎత్తుతాడు)

బాబు:- ఆ! (అంటూ చేతిలోవున్న కత్తితో డొక్కలో పొడుస్తాడు)

రవి :- అబ్బా! (క్రింద పడిపోతాడు)

రాణి:- నాన్నా! (అంటూ తండ్రిమీదపడి ఏడుస్తూవుంటుంది)

బాబు:- ఏమంటావ్! లేకపోతే మీ నాన్నదారే నువ్వూ తొక్కాల్సి వుంటుంది. తొందరగా చెప్పు ఏమంటావ్!

రాణి :- ఛీ .. దుర్మార్గుడా! నీకు బుద్ధివుందా లేదా? ఎన్ని సార్లు చెప్పాలి -

బాబు :- కావలసినకార్య మయ్యేంతవరకూ చెప్తూనేవుండాలి. అందుకే ఆనోటికి శ్రమివ్వక వెంటనే నా కోర్కె నెర



వేర్పాటనంటే తక్షణం వెళ్ళిపోతాను. రా! రా!
(అంటూ చెయ్యి పట్టుకొని లాగుతూవుంటాడు)

రాణి :- (విదలించుకొని చెంపమీద కొడుతుంది)

బాబు :- ఆ! (అంటు కత్తితో పొడుస్తాడు)

రాణి :- అమ్మా! (అంటు నేలకొరుగుతుంది)

రవి :- (ఈ దృశ్యమంతా చూచి నెమ్మదిగా లేచి చేతిలోని కర్రతో బాబు తలమీద కొట్టి పడిపోతాడు)

బాబు:- (తలపగిలి క్రింద పడతాడు)

(తెరలో - పాట)

ఓ! లోకమా!
అంధకారమే శరణ్యమా!
భారతదేశపు ఔన్నత్యంబిదేనా!
ప్రణయమే ప్రళయంబానా
ప్రేమజీవుని ప్రణయనావ
కు సుడిగుండమే శరణ్యమా
ఇదేనా లోకం, ఇదేనా దేశం
ఇదే సుడిగుండం!!

— తెర —

# సమాధి

## 6వ రంగము



(తెరలేచేసరికి "రిహార్సల్సు రూమ్" అని బోర్డు తగిలించివుంటుంది. సమయం షుమారు ఉదయం 8 గం॥లు. 4 కుర్చీలు, ఒక టేబిల్, ఒకచాప చిక్కిరి బిక్కిరిగా పడేసి వుంటై. ఒకప్రక్క ఆర్కెస్ట్రా సామానులన్నీ వుంటై. బాబు బల్లమీద నిద్రపోతుంటాడు. రావు వచ్చి అంతా పరికిస్తాడు.)

రావు:- రవీ! రవీ! (ఏమీ సమాధానం రాకపోవటం చూచి బిగ్గరగా) రవీ! రవీ!

రాణి:- (లోనినుంచే) ఎవరూ! (నిద్రకళ్ళతో వస్తుంది)

రావు:- రవి వున్నాడా?

రాణి:- ఆఁ వున్నారు.

రావు:- ఏంచేస్తున్నాడు?

రాణి:- నిద్రపోతున్నారు.

రావు:- ఎక్కడ?

రాణి:- అవతల రూంలో.

రావు:- ఒకసారి పిలుచుకురా.



రాణి:- నిద్రలేపితే కోప్పడతారండీ! రాత్రి తెల్లవార్లూ నిద్ర లేదు.

రావు:- ఏమీ ఫరవాలేదు. అర్జంటు పనుంది. ఒకసారి లేపి రా.

రాణి:- ఏంపని ?

రావు:- ఏంపనైతే ఏం ? నీకు చెప్పాలా ?

రాణి:- మాలో ఎవరికి చెప్పినా ఒకటే కాబట్టి.

రావు:- అంటే ! ఆయనెవరూ, నువ్వెవరూ?

రాణి:- వారు నా భర్త !

రావు:- ఏమిటీ ! అదా యిక్కడ మకాంపెట్టిన వ్యవహారం ! (గంభీరంగా) అమ్మాయ్ ! మర్యాదగా వెళ్ళి పిల్చుకురా.

రాణి:- చెప్తుంటే మీకాదూ ! మీ కేమైనా చాదస్తమా ఏమిటీ ?

రావు:- చాదస్తం కాకపోతే యిక్కడికెందుకు వస్తాను. మీ నాన్న వచ్చాడు అర్జంటుగా పిలుస్తున్నాడని చెప్పు.

రాణి:- (భయంగా) ఆఁ ! (అంటూ లోపలికి వెళ్తుంది)

రావు:- వెనకటికి "రంకుసాగితే పెళ్ళెందు" కన్నాడట ఒక మహానుభావుడు. అట్లావుంది యీయన వ్యవహారం. రిహార్సల్సు నంకబెట్టుకుని ఆవిడను లేవదీసుకువచ్చి యిక్కడ మకాం పెట్టాడన్నమాట. నేను బ్రతికుండగా



నా కళ్ళుగప్పే యింత నాటక మాడుతున్నాడు. బాగానేవుంది!

రవి :- (నిద్రమొహాం తుడుచుకుంటూవచ్చి) ఏం నాన్నా! కూర్చోండి!

రావు:- కూర్చోటానికి రాలేదు.

రవి :- మరి ఎందుకువచ్చారు?

రావు:- రాత్రి యింటికి రాలేదేంరా?

రవి:- మీరు నిన్న చెప్పారుగా ఎవర్నో ఒకర్ని ఒదులుకోమని.

రావు:- అయితే నాతో సంబంధం తెగతెంపులు చేసుకోటానికి నిశ్చయించుకున్నావన్నమాట!

రవి :- ఆ విషయం కన్పిస్తూనే వుందిగా!

రావు:- చిన్ననాటనుండీ పెంచి పెద్దచేసిన నేనే నీకు భారమై పోయానన్నమాట! యింకో విషయం చెప్తున్నాను విను. నా యిష్టప్రకారం నడిస్తేనే నాఆస్తి నీకు దక్కు తుంది. లేకపోతే నీకూ-నాకూ యీ రోజుతో ఏమీ సంబంధం వుండదు తెలుసా?

రవి :- నాన్నా! తుమ్మెద పుష్పాన్ని కాదు కోరేది- అందులో మిళితమైన మకరందాన్ని మాత్రమే. అట్లాగే నేను మీ డబ్బుకాసించను. మిమ్మ్ని, మీ సుఖాన్ని కోర తాను - అంతే.



రావు:- లోకంలో డబ్బు లేనివాడి విలువ తెలుసుగా. ఈ డబ్బును చూచే నీ మిత్రులంతా నీ దగ్గర చేరు తున్నారు. రేపు మనం విడిపోయిన విషయం తెలిస్తే నీ మొహం ఎవ్వరూచూడరు. బాగా ఆలోచించుకో.

రవి :- డబ్బుతో మభ్యపెట్టి ఎంతమంది మిత్రులను ఎంత కాలం సంపాయిస్తాం. ఆపదలోవున్న మిత్రుని ఆదుకునే వాడే మిత్రుడు. అయినా నా గురించి మీరేమీ ఆలోచించవద్దు. మీ ఆస్తితో మీరు హాయిగా అనుభ వించండి.

రావు:- ముమ్మాటికీ అంతేనా ?

రవి :- అంతే.

రావు:- సరే నీఖర్మ నువ్వు అనుభవించు. "అదృష్టం అందల మెక్కిస్తే - బుద్ధి బురదలోకి లాగిందంట" యీ మొతో కలసి సంసారం ఎట్లా వెలగబెడతావో నేనూచూస్తాను. (వెళ్తాడు)

రాణి:- (వస్తుంది. రావు వెళ్లినవైపే చూస్తూ) ఏమిటండీ అలా గన్నారు. నిన్న యింటికాడ ఏమైనా గొడవ జరిగిం దేమిటీ!

రవి :- అవును.

రాణి :- మరి నాతో చెప్పలేదేం ?

రవి :- చెప్పుదామనుకున్నాను. కాని నాటిక గొడవలో మర్చి పోయాను.

బాబు:- (కలవరిస్తూంటాడు నిద్రలో) కలెక్షన్ రాక మేము మేస్తుంటే నాటకం మొదలుపెట్టమని మీరు కేదుస్తారు. మీకంత సరదాగా చూడాలనుకుంటే తలో పది రూపాయలు వేసుకుని ఆడించరాదూ!

రాణి :- (నవ్వుతుంది)

రవి :- (నవ్వుతూ) అరేయ్! బాబూ! బాబూ! (అంటూ లేపుతాడు)

బాబు :- (గాబరాగా లేచి) అరే చాలా పొద్దెక్కిందే! లేపన్నా లేపలేదే!

రవి:- (టైంచూచి) ఆఁ పదకుండేగా అయింది.

బాబు :- అయితే వెళ్ళి కాఫీ పంపుతాను.

రాణి :- ఇంకా కాఫీ ఏమిటండీ భోజనా టైం కానస్తుంటే! ఆ మీరు ఏదో కలవరిస్తున్నారుకదూ!

బాబు:- ఆఁ మనసు ఎక్కడైనా ఒకటే కలవరింతలు. నాటకాల గొడవే ఏదో కలొస్తూనస్తూవుంది. మా వాడు లేడు. సరే! నేవెళ్ళి కేరేజీతో మీల్సుపంపి భోంచేసి వస్తాను. (వెళ్తాడు)

(రాణి, రవీ ఒకరి మొహాలు ఒకరు చూచుకుంటారు, ఒకర్ని మొహానా సెత్తురుచుక్క లేదు. 1, 2 సార్లు మాట్లాడుకోబోతారు. కాని మాట్లాడలేరు)

రాణి :- అలా వున్నారేమండీ?

రవి :- ఊఁ ఏమీలేదు. నా గురించి మీ మామయ్య నిన్ను వదలి వెళ్ళిపోయాడటగా!

రాణి:- నా గురించి మీ నాన్న మిమ్మల్ని వదలి వెళ్ళలేదూ!

రవి :- (వాడిన నవ్వు నవ్వి) చుక్కాని లేని నావలు రెండూ ఒకేదారిని పయనిస్తున్నాయన్నమాట!

రాణి :- అదేమిటండీ! మీకు నేనులేనా, నాకు మీరు లేరా.

రవి :- వున్నాం కాని మన నావలకు గమ్యస్థానం లేదు.

రాణి :- ఎప్పటికైనా చేరుకోలేక పోతామా ?

రవి :- నిజమే! ఎందుకు చేరలేం! సాహసించి లోకానికి ఎదురీది గమ్యస్థానం చేరటంలోనే వుంది గొప్పతనం.

రాణి :- అవును అలాగే చేద్దాం. మనం అధైర్యపడాల్సిన అవుసర మేముంది? మీరు నాటకాలు వ్రాస్తారు. మనం నాటకాలు వేస్తాం. ప్రస్తుత లోకానికి ఆదర్శంగా వుండే నాటకాలు వ్రాయండి. ప్రజల్లో నీతిని అవినీతిని బయట పెట్టండి. అవి మనం ప్రదర్శించి ప్రజావాణిలో అఖండ కీర్తి నార్జిద్దాం. సాంఘిక నాటకాలంటే ఏమిటో తెలియజేద్దాం! ప్రపంచంలో ఆదర్శంగా జీవిద్దాం!

రవి :- రాణీ!

రాణి:- రవీ!



రవి :- (ఆనందంగా రాణి చెయ్యి పట్టుకొని మీదికి లాక్కో బోగా రాణి పారిపోతుంది)

(డైలాగ్ సాంగ్)

రాణి :- అహహో నా రాజా
అందాల రాజా

రవి :- అహహో నా రాణీ
అందాల రాణీ

రాణి :- ఆదర్శంబోయీ నా రాజా
మన జీవితంబే ఆదర్శంబా ॥ అ ॥
నాటి బాసలు నేటితో తీరె
నేటి కలలూ నాటి బాసలే
ఆదర్శంబుగ వెలయుదమే
ప్రేమ వాహినిలో నడుపుదమే
నావను నడుపుదమే ॥ అ ॥

రవి :- అహహో నా రాణీ
అందాల రాణీ

రాణి :- వనితనోయ్ వలపుల వయ్యారినోయ్
మరల వలపులో పొంచినాడవోయ్
రాజా ... ... ...

రవి :- రాణీ ... ... ...

ఆనంద డోలికలలో వుర్రూతలూగుచుండగా -

— తెర వ్రాలును —

# సమాధి

## 7వ రంగము



(కన్న కుమారునికి దూరమైన "రావు" ఏమీ తోచక పిచ్చివాని వలే అయోమయంగా తెర ముందుగా తిరుగుతూ వుంటాడు. తెరలో అంతరాత్మ ఘోష వినిపిస్తూంది)

ఆత్మ :- (నవ్వు) పిచ్చివాడా : ఎందుకలా బాధ పడతావ్ !

రావు:- ఎందుకా ! ఎందుకని చెప్పను ? ప్రాణంతో సమానంగా పెంచుకున్న నా కుమారుడు నాకే దూరమయ్యాడు. ఒక్కగా నొక్క కుమారుడు. వున్న ఒక్కడికైనా ఆనందంగా వివాహంచేసి వున్న ఆస్తినంతా వాడి చేతులో పెట్టి సుఖంగా జీవిద్దామని ఎన్నో గాలి మేడలు కట్టుకున్నాను ! ఆశా సౌధాలు నిర్మించుకున్నాను! ఊహా సామ్రాజ్యంలో వుర్రూతలూగాను! అన్నీ క్షణంలో నాకు ఎదురైనై. నేను నిర్మించుకున్న గాలి మేడలు కూలిపోయినై! ఆశా సౌధాలు అంతర్ధానమైనై. నా వూహా సామ్రాజ్యం సర్వనాశనమైంది. (బాధతో కుమిలిపోతుంటాడు)

ఆత్మ :- (నవ్వుతూంటుంది)



రావు:- (అయోమయంగా చూస్తుంటాడు)

ఆత్మ :- పిచ్చివాడా ! యింత మాత్రానికే నిరుత్సాహపడాలా! జరిగిపోయిన కాలం ముందెంతో వుంది కన్న కుమారుని హృదయం మార్చి నీ వశం చేసుకోలేవా ?

రావు:- ఆఁ ! ఎలా సాధ్యమౌతుంది ?

ఆత్మ :- (నవ్వి) సాధ్యం కాదా ! మానవుడికి అసాధ్యమైనదేదీ లేదు. ఆలోచించు !

రావు:- ఆలోచించటానికి అవకాశము లేక నే అయోమయంతో కృంగిపోతున్నాను.

ఆత్మ:- అయితే విను. నేను చెప్పినట్లు జాగ్రత్తగా సంచరించు. నీ కుమారుడు తప్పక నీ వశమౌతాడు.

రావు:- ఆఁ ! (సంతోషంగా) అవుతాడా ! నా వశమౌతాడా?

ఆత్మ :- ఓఁ తప్పకుండాను ! విను. నీ కుమారుని వద్దకు వెళ్ళు ! వారిరువురూ దంపతులుగా వుండటానికి అంగీకరించు !. నీ వెంట తీసుకువెళ్ళు ! నమ్మకంగా సంచరించు ! త్వరలో రాబోయే నీ కుమారుని జన్మదినోత్సవానికి వానిచేత ఒక నాటకం వ్రాయించి ప్రదర్శించటానికి సన్నాహాలు జరుపు. పదిమంది బంధువుల్నీ స్నేహితుల్నీ పిలచి నీవూ ఆ నాటకంలో పాత్ర



ధరించి నీ చేత్తో నీ కోడలిని హత్య చెయ్యి. గత్యంతరం లేక నీ కుమారుడు నీ కోసం యింటికి వస్తాడు! నీ మాటే వింటాడు! నీ కోసమే వుంటాడు.

రావు:- (సంతోషంగా) అవును! మంచి ఆలోచన. అలాగే చేస్తాను. ఇప్పుడే వెళ్ళి నమ్మకంగా నా కుమారుని యింటికి తీసుకువెళ్తాను! (అంటూ లోనికి వెళ్తాడు)

(తెర లేచేసరికి రెండవ సీను మాదిరే. పరికరములు అమర్చవలెను. రవి పేపరు చదువుకుంటూ కూర్చుంటాడు తెరలో పాట వినిపిస్తూవుంటుంది.)

(తెరలో బిచ్చగాని పాట)

జీవా నిరుపేద బ్రతుకే వృధా
పేద జీవుల దీనాలాపనలు
ఆలకించెడి దాతలే లేరా!
అనాథల ఆక్రందనాలు
ఆలకించి ఆనందముగా
ధర్మము చేయగా దయచేయండీ ॥

(రవి పాటవింటూ ఆలోచిస్తాడు)

రాణి :- (వచ్చి) ఏమిటండీ ఆలోచిస్తున్నారు?

రవి :- ఆలోచించే దేముందీ... ఆ పేద జీవుల దీనాలాపనలు వింటున్నాను.



రాణి :- వింటే ఏంలాభం? తోచిం దేదైనా ధర్మం చెయ్యాలి గాని.

రవి :- చెయ్యటానికి ప్రయత్నిద్దామనా్న చేతిలో చిల్లిగవ్వ కూడా లేదుగా!

రావు:- (ఆనందంగా ప్రవేశించి) నాయనా!

రవి :- ఏం నాన్నా! (అంటూ లేస్తాడు)

రావు:- నిన్నొక విషయం అడుగుదామని వచ్చాను. అడగమని అనేకమంది ప్రోత్సహించారుకూడా!

రవి :- ఏమిటి?

రావు:- జరిగిందేదో జరిగింది. ఎంత జరిగినా నేను నీ తండ్రిని కాకపోను, నువ్వు నా కొడుకువి కాకపోవు. నీ యిష్ట ప్రకారమే మీ యిద్దరూ కలిసే వుండటానికి అంగీక రిస్తున్నాను. అనవసరంగా యిష్టంలేని పెళ్ళిచేసి నీ జీవి తం నాశనం చేయటంకూడా నాకు యిష్టంలేదు. ఇప్పటికైనా మించిపోయిందేమీ లేదు. కనుక అంతా కలసే వుందాం!

రవి :- (రాణి వంక అనుమానంగా చూస్తాడు)

రావు:- ఏమమ్మా! ఏమంటావ్! నా కోర్కెను తిరస్కరించ వనుకుంటాను.



రాణి :- నాదేముందండీ! ఆయనిష్టప్రకారం నడవాల్సిన దాని నేగా నేను. వారి యిష్టమే నా యిష్టంకూడాను.

రావు:- ఏరా రవీ?

రవి :- యింకేం! మీ విరోధస్తురాలే అంగీకరించినప్పుడు నాదేముంది.

రాణి :- అయితే మీరో!

రవి :- తప్పుతుందా మరి.

రావు:- సరే పదండి. యీ పూట యింట్లో గృహప్రవేశ మాదాం. యీ రోజు మంచిరోజు కూడాను.

రవి :- సరే మీ యిష్టం?

రావు:- అయితే వెళ్ళి బళ్ళు తీసుకువస్తాను. (వెళ్తాడు)

రవి :- (అటువైపే చూస్తూ) ఏమిటిలా మారిపోయాండు.

రాణి:- ఆఁ! నలుగురూ నాలుగు చివాట్లు పెడితే మారక ఏంచేస్తాడు.

రవి :- అనేకమంది అనేక విధాలుగా చెప్తుంటే యీాయనవచ్చి అలా ప్రవర్తిస్తుంటే మన జీవితాలు నాశనమవ్వవూ?

రాణి :- అందుకే మన జాగ్రత్తలో మనం వుంటం మంచిది.

రావు:- (వస్తాడు) బళ్ళు వస్తున్నై. సామానులవీ సర్దారా?

రవి :- సర్దేటంత సామానేముందీ?



రావు:- నా కోర్కె యింకొకటి మీరు తీర్చాలి.

రాణి :- ఏమిటి ?

రావు:- ఎల్లుండి మంచి రోజు తెలుసా ?

రవి :- ఎందుకు ?

రావు:- ఎందుకా !... ... చెప్పమంటారా ?

రాణి :- చెప్పండి.

రావు:- (రవివంక చూచి) నీ జన్మదినోత్సవంరా !

రాణి :- (సంతోషంగా) ఆఁ !

రావు :- మరేమనుకున్నావ్ ! ఆ శుభ సమయంలో మీ దంపతులు మంచి నాటక మొకటి ప్రదర్శించాలి. ఆ రోజున మా స్నేహితు లందర్నీ ఆహ్వానిస్తాను. అవసరమైతే నేనూ నటిస్తాను.

రాణి :- (ఆశ్చర్యంగా) ఏమిటీ ! మీరూ నటిస్తారా !

రావు:- అంటే నటించలేననా ! ఏరా రవీ ?

రవి :- అవును మా నాన్న చిన్నప్పుడు రామదాసులో రామదాసు - హరిశ్చంద్రలో హరిశ్చంద్రుడు...

రావు:- కాళిదాసులో కాళిదాసు.

రవి:- ఆఁ ... మొదలైన వేషాలెన్నో వేశారు.

రాణి :- అయితే నాకు ఎప్పుడూ చెప్పలేదేమండీ ?

(తెర లేచేసరికి రెండు సోఫాలు, ఒక డస్కు, క్రింద చాపమీద రావు కూర్చుని శ్లోకం చదువుకుంటూంటాడు)

బాబు:- (గాబరాగా పరుగెత్తి వచ్చి క్రిందపడి లేచి నులుపు కుంటూ) హయ్యాగార్! హయ్యాగార్!

రావు: ఏమిటిరా హడావుడి కంగారు జంతువులాగా!

బాబు:- (పెద్దగా) హేమ్లాహాంటే .. (చిన్నగా) హేమ్లా హాంటే .. (నీరసంగా) హాంటే .. హాంటే...

రావు:- ఏమిటిరా హాంటే హాంటే నీ మొహం -

బాబు:- హేమ్లా లేదూహాండీ.

రావు:- లేకపోతే బయటకుపోయి కూర్చో.

బాబు:- (వెళ్ళబోయి తిరిగివచ్చి) హయ్యాగార్! అబ్బాయీ గారూ వచ్చేటైమూ హయ్యిందీ లేదూ హాండీ?

రావు:- అయ్యింది

బాబు:- మరి మనింట్లో హింకా రాలేదూ హెందుకూహాండీ?

రావు:- బండి లేటయ్యిందేమో?

బాబు:- హాయితే బాబూ! అబ్బాయీగారూ మద్రాస్లో హేమ్లా సేత్తున్నారూ హాండీ?

రావు:- సినిమాలో యాక్టు చేస్తున్నాడు.

బాబు:- హేమ్లా సినిమాహాండీ?

రావు:- తెలుగు సినిమా.

బాబు:- అదికాదూహాండీ సినిమా అనేదాన్కి పేరూ వుందీ లేదూహాండీ ?

రావు:- లేకేం! వుంది. కాని పిక్చర్ కి యింకా పేరు పెట్ట లేదు.

బాబు:- సినిమాలో యాక్ట్రా చేస్తే డబ్బ్యా హిస్తాగూనాండీ ?

రావు:- ఓ బోలెడు డబ్బు యిస్తారు.

బాబు:- మరియిస్తే మీాకీ వందల్కి- వందల్ పంపుతూంటారూ హెందుక్క హాండీ ?

రావు:- ఎందుకంటే... పట్నంలో అంతా డబ్బుతోనే వుం టుంది. డబ్బులేందే అడుగు బయట పెట్టలేం. అసలు పట్టణ జీవితమే అంత. ఆ పట్నంలో మా అబ్బాయి డాబుసరిగా డ్రస్సు వేసుకుని డబ్బుసంచి చేతోపుచ్చు కుని డబాయించి నడుస్తూంటే చూచి ప్రేమించని ఆడది లేదంటేనమ్ము.

బాబు:- హాయితే బాబూ! ఆ పట్నం ఎలాగుంటుందీహాండీ?

రావు:- ఎలాగుంటుందంటే ... ... ఏం చెప్పాలో కూడా అర్థం కావటం లేదు.

బాబు:- హెందుక్క హాండీ!



రావు:- ఆ భవనాలూ, తీర్చి దిద్దిన షాపులు, బస్సులు, ట్రాములు, ఎలక్ట్రిక్ ట్రైన్స్, ఓహోహో! ఏం అందంగా వుంటుందనుకున్నాను!

బాబు:- (గుటకలు మింగుతూ) అబ్బ హెంతా మంచీ హూరూ హండీ! మీాకూ మాాచారూహండీ!

రావు:- అబ్బే యింకా ఎక్కడ? అబ్బాయి చెప్పితే యినన్నీ విన్నాను. అంతే. యీ తఫా అబ్బాయి వెంబడి వెళ్ళాలనుకుంటున్నాను.

బాబు: హాయితే బాబూ! మీాకీ హెళ్తే నాకీకూాడా తీసూక్హెళ్ళండి!

(బయట బండి ఆగిన చప్పుడు)

రావు:- (సంతోషంగా బయటకు చూస్తూ) అబ్బాయివచ్చాడు వెళ్ళి సామాన్లు లోపల పట్టించు.

(బాబు బయటకు వెళ్తాడు: క్షణంలో బాబు బెడ్డింగ్, రవి లెదర్ బాక్స్, రాణి ఒక లెదర్ బ్యాగ్‌తో ప్రవేశిస్తారు రావు ఆశ్చర్యంగా చూస్తూంటాడు. బాబు బెడ్డింగ్ లోపలపెట్టి వచ్చి లెదర్ బాక్స్, బాగ్ తీసుకు వెళ్తాడు)

రావు:- (రాణిని ఆశ్చర్యంగా చూస్తూ) ఎవరీ అమ్మాయ్?

రవి:- (వెలిగా నవ్వుతూ) షి యీాజ్ మై వైఫ్!

రావు:- ఆఁ!

రవి:- నో, నో, షి ఖ్యాజ్ మైలవర్!

రావు:- అంటే?

రవి:- నేను వేంచేశాను నాన్నా!

రావు:- ఎందుకు?

రవి:- మేరేజ్ చేసుకున్నాను.

రావు:- ఏమిటీ?

రవి:- అవును నాన్నా!

రావు:- ఏమిటవును?

రవి:- రిజిష్టర్ మేరేజ్ చేసుకున్నాం.

రావు:- ఏడ్చావ్.

రవి:- థాంక్సు! దట్స్‌యువరానర్

రావు:- ఏ అమ్మాయ్! ఎందుకొచ్చావ్?

రాణి:- మీా అబ్బాయి తీసుకువస్తే!

రావు:- ఎందుకు తీసుకువచ్చాడు?

రాణి:- చెప్పాడుగా మీా అబ్బాయి.

రావు:- నీ నోటితో చెప్పు.

రాణి:- పెళ్ళిచేసుకున్నాం.

రావు:- ఎవరు చేశారు?

రాణి:- రిజిష్ట్రార్ ఆఫీస్‌లో రిజిష్టర్ మేరేజ్ చేసుకున్నాం.

రావు:- అయితే నువ్వు మద్రాసు వెళ్ళిందెందుకురా?

రవి:- పిక్చర్‌లో యాక్టు చేయటానికి.

రావు:- యిప్పుడు చేసిందేమిటి?

రవి :- యదార్థ ప్రపంచంలో నాచురల్‌గా యాక్టు చేస్తున్నాను.

రావు:- అయితే నువ్వు మద్రాసు వెళ్ళి చేసినపని యిదేనా?

రవి :- ఛ! ఛ! యిది రిహార్సలు. త్వరలో తీయబోయే "తాతయ్య పెళ్ళి" అనే పిక్చర్‌లో యిలాంటి ఘట్ట మొకటుంది. ఆక్యారక్టర్ ఎవరు బాగాచేస్తే వాళ్ళ కిస్తానన్నారు. అందుకే యీ అవస్థంతాను.

రావు:- అయితే యింటికెందుకు తీసుకు వచ్చావ్!

రవి :- ఇంకెక్కడికి వెళ్తుంది?

రావు:- అంటే?

రవి :- అంటే... ఆ అమ్మాయిని నేను కొన్నాను.

రాణి :- అవును వెయ్యి రూపాయలుపెట్టి ఎక్స్‌ట్రా సప్లయిర్ దగ్గర కొన్నారు.

రావు:- ఏం కులం?

రాణి:- నాకు కులంలేదు.

రావు:- కులం లేనివాళ్ళుకూడా కొందరుంటారన్నమాట!

రాణి :- తల్లిదండ్రుల కులాలకు తేడాలున్నప్పుడు ఆమె దేనిల వస్తుంది ?

రావు:- అయితే వర్ణ సంకర జాతన్నమాట! ఏంరా! యింతకీ నువ్వు ఏ పిక్చర్‌లోనూ యాక్టు చెయ్యలేదన్నమాట?

రవి :- లేకేం ! చాలావున్నై.

రావు:- ఎందుల్లో! ఏమేశావ్ ?

రవి :- అనేక పిక్చర్స్‌లో అనేక ఫోజులిచ్చి గ్రూఫ్ షాట్స్‌లో ఎక్‌స్ట్రాలతో పాటు నిల్చున్నాను.

రావు:- ఇంతవరకు ఏమీ రిలీజ్ కాలేదేం ?

రవి :- రిలీజ్ అయిన పిక్చర్స్‌లో కూడా వున్నాను. కాని ...

రావు:- కాని ?

రవి :- యాంగిల్సు బావుండలేదని డైరెక్టరు, స్పీచ్ బావుండ లేదని సెన్సారు వాళ్ళు, ప్రేక్షకులు రాళ్ళు విసురుతా రేమోనని డిస్ట్రిబ్యూటర్లు కట్ చేయించారు. ఇక ముందు వచ్చే పిక్చర్స్ అన్నిట్లో మైన్ ఎక్‌స్ట్రా నేనే!

రావు:- అయితే హీరోగా యాక్టు చేస్తున్నానన్నావ్ ?

రవి: - యీ రోజుల్లో పెట్టుబడి లేందే హీరోలు కావటం చాలా కష్టం. ఏదో విధంగా ఎంటరైతే చాలని ఛాన్సు వచ్చినప్పుడల్లా తయారయ్యేవాణ్ణి. మన ఫేస్ కొన్ని యాంగిల్స్‌లో చాలా బాగుంటుందని అనేక ఎక్‌స్ట్రాలు

అంటూంటే వింటూండేవాణ్ణి. అందుకే తీయబోయే "తాతయ్య పెళ్ళి" లో తొంభై తొమ్మిదిపాళ్ళు నేనే హీరోని.

రావు:- అన్నీ పడ్చావ్ కాని వున్నదేదో తిని పడుండు.

రవి :- (ఆవేశంతో) ఇన్‌సల్టు! కళా రంగానికే యిన్‌సల్టు! కళోపాసియైన యీ నటనాగ్రేస్వర చక్రవర్తికి తిండి తలవంపులు! ఇక సహింపజాల! సహింపజాల!

ధిక్కారముల సైతునా
కుటిలజన ధిక్కార
ధిక్కార ధిక్కారముల
సైతునా!

రావు:- ఛీ! నోర్మూయ్! ఇంట్లోకి పో!

రవి: (యింట్లోకి వెళ్తుంటాడు)

రాణి:- (వెనకాల వెళ్తుంటుంది)

రావు:- (అడ్డువచ్చి) ఆగు!

రాణి:- (ఆగుతుంది)

రావు:- తమరు ఇంటికి దయచేయండి.

రవి :- (ఆగి) అందుకే నా వెనక వస్తూంది.

రావు:- యీ యింటికి కాదోయ్!



రవి :- మరే యింటికి?

రావు:- దాని పుట్టింటికి

రవి :- పెళ్లయిందిగా భర్తింటికి వచ్చింది.

రావు:- పెళ్ళి! అదీ ఒక పెళ్లేనా? పిచ్చిపిచ్చి వేషాలుచూసి కులస్తుల పిల్లను పెళ్లిచేసుకుని ఇంట్లో పడుండు.

రవి :- నేను ఛస్తే యింకో పెళ్ళి చేసుకోను.

రావు:- చేసుకోపోతే నీ దారి నువ్వు చూసుకో పో!

రవి :- సరే! (రాణి, రవి బయటకు వెళ్ళబోతారు)

రావు:- ముందు వెనక లాలోచించుకుని వెళ్ళటం మంచిది. లేకపోతే నీ జీవితం యీ రోజుతో అఖరౌతుంది.

రవి :- అయినా యిష్టమేకాని యీమెనుమాత్రం విడచి పెట్టను.

రావు:- విడచిపెట్టవూ?

రవి:- విడచిపెట్టను.

రావు:- (డస్కులోనుంచి పిస్టల్ తీసి) ఆఖరుసారిగా అడుగుతున్నాను. విడచి పెడ్తావా లేదా?

రవి:- విడచిపెట్టను,

రావు:- ప్రాణాలు తీస్తాను. (అంటూ గురిచూపుతాడు)



రవి :- అంతేగా ! శరీరాలు వేరుచేయగలరు కాని హృదయాలను వేరుచేయలేరుగా ! (అంటూ వెళ్ళిపోతుంటాడు)

రావు :- ఆగు ! ఆగు ! ఆగు ! (అంటూ కాలనబోతాడు. రాణి గాబరాగా వెళ్లి పిస్టల్‌కి అడ్డు నిలుస్తుంది. రావు కాలుస్తాడు. రాణీ క్రిందపడిపోతుంది. రావు నవ్వుకుంటూ వెళ్లబోతాడు)

రవి :- (గాబరాగా వచ్చి) నాన్నా ! నాటకమవ్వందే వెళ్ళిపోతారేమిటి ?

రావు:- (నవ్వి) నాటకం! నా జీవిత నాటకంలో ఒక ముఖ్య ఘట్టం ముగిసింది. అందుకే ఈ కపట నాటకమంతాను.

రవి :- ఆఁ! (రాణి దగ్గరకు వెళ్ళి పరిశీలిస్తాడు. ప్రాణాలు పోయినట్లు గమనిస్తాడు. తండ్రి చేతిలో పిస్టల్ లాక్కొని అది నిజమయిందని తెల్సుకొని క్రింద పారేస్తాడు, రాణి దగ్గర కూర్చొని రాణీ ! అంటూ ఏడుస్తుంటాడు)

(రాణికోసం పిచ్చివాడైన భాను ప్రేక్షకుల్లోనుంచి లేచివస్తూ)

భాను:- ఆఁ ! రాణీని చంపేశారా ! నా రాణీనే ! కాదు ! నేను నమ్మను. (అంటూ రంగస్థలంమీదికి వెళ్తాడు (రాణిని పరిశీలించి) రాణీ! చచ్చిపోయావా ! (నవ్వి) పోతే పోయావులే ! నీ గురించి నేనుపిచ్చోణ్ణయ్యాను.

నా గురించి నువ్వు చచ్చిపోయావ్ కదూ! (నవ్వుతూ వెళ్తూ రావును క్రిందనుంచి పైదాకా చూచి, షేక్ హేండ్ ఇచ్చి నవ్వుకుంటూ వెళ్తుంటాడు. రావు అయోమయంగా అతని వంకే చూస్తుంటాడు. భాను సీరియస్‌గా వెనక్కి తిరిగివచ్చి రావు కంఠం పుచ్చుకొని) ఏయ్! నా రాణిని చంపింది నువ్వేనా! మాట్లాడవేం! చెప్పు (రావు భయంతో వణికిపోతూంటాడు) చెప్తావా చెప్పు తీసుకుకొట్టమంటావా? ఏం? (పెద్దగా నవ్వుతాడు) తప్పైపోయిందా! పోనీలే యీ కెప్పుడూ చంపకేం. వస్తానూ! (నవ్వుకుంటూ బయట వైపుకు వెళ్తాడు)

రవి:- (రావు వంక చూస్తూ) ఎంతపని చేశారు నాన్నా! దీనికోసమేనా మమ్మల్ని నమ్మించి తీసుకువచ్చింది. నా జన్మ దినోత్సవమని నమ్మించి తీసుకువచ్చి నా రాణి మరణ దినోత్సవం చేసులారా సమర్పించారు. సంతోషం! యింతమాత్రాన నా హృదయం మార్చగలరా!

రావు:- మారినా మారకపోయినా నా కోర్కె నెరవేరిందంతే! మిమ్మల్ని వేరు చెయ్యాలనుకున్నాను. అందుకే నమ్మించాను. మోసం చేశాను. అంతే! నాక్కావల సిందంతే! ఇప్పటికైనా నామాటవిని నచ్చావా ... లక్షాధికారి బిడ్డకిచ్చి వివాహం చేస్తాను. ఆలోచించుకో!



S. I. (ప్రేక్షకుల్లోంచి లేచి) యూ ప్లీజ్ స్టాప్ ది డ్రామా! (అంటూ స్టేజీ మీదకు వెళ్ళి రాణిని పరీశీలించి రావు దగ్గరకు వెళ్లి) ఏమిటండీ యీ నీచం? నాటకమని నంకపెట్టి అన్యాయంగా ఆ ఆడబిడ్డ ప్రాణం తీస్తారా! ఆ రివాల్వారులోనే నిన్న కాలుస్తే నీ కెలావుంటుంది? మనిషి పుటక పుట్టారా సరా! జ్ఞానం వుండక్కర్లా!

రావు:- మాట లనవసరం.

S. I అయితే చెప్పటే అవసరమంటారు.

రావు:- ఏదవసరమైనా మీ కనవసరం. మీకు చేతనైంది మీరు చేసుకోండి. నాకు మీ రిచ్చ భాష శిక్ష తెలిసే యీ పని చేశాను. ఎందుకంటారేమో... కన్న కొడుకే నాకు కాకుండా పోయినప్పుడు నేను జీవించి మాత్రం ప్రయోజన మేముంది. అందుకే యీ కార్యం తలపెట్టాను. నా విరోధస్తురాల్ని అంతం చేశాను. నేనూ అందుకు సిద్ధంగా వున్నాను. పదండి.

S. I. (రావు చేతులను బేడీలు తగిలించి) సరే! పద! ప్రాణాలంటే ఎంత చులకనగా మాట్లాడావ్. ప్రాణాలంటే ఎంత తీపో వురికంబాన్నెక్కించినప్పుడు అర్థమౌతుంది. మనుష్యులను చంపే నీలాంటి మానవుల్ని ముక్కలు ముక్కలుగా విడదీసి కాకులకు గద్దలకు వెయ్యాలి. అప్పుడుగాని లోకం హర్షించదు. పద! (అంటూ లాక్కు వెళ్తాడు)



రవి :- (రాణి దగ్గరకువెళ్ళి) వివాహం! యింక యీ జీవితానికి ఒకటే వివాహం? యింతమాత్రంచేత మా శరీరాలు వేరుచేశారు కాని హృదయాలు మాత్రం వేరు చెయ్యలేరుగా! ఎన్నో ఆదర్శాలు పెట్టుకు జీవిద్దామనుకున్నాం! అన్నీ మాకే ఎదురైనై! చచ్చేం సాధిస్తామని చావకుండా లోకాని కెదురీదాం! కాని కాల ప్రవాహంలో నా రాణి మునిగి కొట్టుకుపోయింది. హృదయపూర్వకంగా ప్రేమించిన ప్రియురాలిని రక్షించుకోలేక పోయాను. అవ్యామోహంలో పడి అంధుణ్ణయ్యాను. అయినా సరే నా రాణి కోసమె యీ జీవితాన్ని వినియోగిస్తాను! క్షణ క్షణమూ ఆవిడ నామమే జపిస్తూంటాను! ఆమె సమాధినే ఆరాధిస్తూంటాను! యిదే నా అంతిమ నిశ్చయం! రాణీ! రాణీ! (అంటూ బాధగా క్రింద కూలబడి రెండు చేతుల్లోకి తీసుకుని - శూన్యంగా చూస్తూ ఎత్తుకు వెళ్ళాలి)

బాబు:- (బాధగా) రవీ!

(లేడీ ఆర్టిస్టు ఎత్తుకు వెళ్ళటానికి అంగీకరించని పక్షంలో 'రవి' విచారిస్తుండగా పాట వినిపిస్తుండగా నిదానంగా తెర పడాలి)

— తెర —

(తెరలో - పాట)

భారతనారీ ఆహుతైపోతివా
ప్రేమజీవులకు ఫలితంబిదేనా
నిరాశయేనా మీకూ నిరాశయేనా
శాశ్వతకీర్తి నార్జించుటకై
దివ్యజ్యోతివై వెలగితి వీవు
నూతన బాటలు నిర్మించుటకూ
భారతనారిగ వెలసితివీవు
ఆదర్శజీవి అంధకారమేనా
ఆహుతేనా అమరజీవి
భారతనారీ !!!



# సమాధి

## 9వ రంగము



(మొదటి రంగం మాదిరే అలంకరించాలి సమాధిమీద రవి వాలి పోయి వుంటాడు. భాను ఒక వైపునుండి పిచ్చిగా నవ్వుకుంటూ వస్తాడు. రవిని చూచి నవ్వుతూ నిలబడతాడు)

రవి :- (లేచి) ఎవరునువ్వు !

భాను:- నేనా (నవ్వు) నేను... నేనే (నవ్వుతాడు)

రవి :- పిచ్చోడిలాగున్నావే !

భాను:- కాకపోతే సమాధిమీదపడి ఎందుకు ఏడుస్తూంటాన్ !

రవి :- నే నేడుస్తున్నానా ! ఏడ్చినా తప్పులేదు. నా రాణి నాను లేనప్పుడు నే నేమైనా ఒకటే. రాణికి నే నున్నాను. కాని రాణి నన్ను ఒంటిగాజేసి వెళ్లింది.

భాను:- (నవ్వి) కాని నా రాణి అలా చెయ్యలేదు.

రవి :- ఏం చేసింది !

భాను:- (నవ్వి) చెప్పనా ! (పెద్దగా నవ్వు) చెప్పాలా !

రవి :- చెప్పు.

భాను:- తనను ప్రేమించినోణ్ణి కాదని తను ప్రేమించిన వాడి కోసం పోయింది. (నవ్వు)

రవి :- (పెద్దగా నవ్వుతాడు)

భాను:- (వెర్రినవ్వు నవ్వుతాడు)

రవి :- (సడెన్‌గా ఆపి) ఆపు!

భాను:- (ఆపుతాడు)

రవి :- ఎందుకు నవ్వుతావు?

భాను:- నా యిష్టం.

రవి :- ఇక్కడ నా రాణి నిద్రిస్తోంది తెలుసా! ఇక్కడ గోల చేయగూడదు. ఎవ్వరూ రాగూడదు. వెళ్ళు! వెళ్ళు!

భాను:- నేను వెళ్ళను.

రవి :- వెళ్ళకపోతే చంపేస్తాను.

భాను:- నన్నా! నన్నా! (నవ్వుతాడు) నే నెప్పుడో చచ్చి పోయాను. ఇంకా నన్నెవరు చంపుతారు! (నవ్వు తూంటాడు)

రవి :- నువ్వు చచ్చిపోయావా! మరి నేనో! నేనూ చచ్చి పోయాను! (నవ్వుతాడు)

భాను:- వట్టి పిచ్చోడిలాగున్నావ్! (నవ్వుతుంటూ వెళ్ళి పోతాడు)



రవి :- (అటేచూస్తూ నవ్వుతూవచ్చి సమాధిమీద తలపెట్టి పడుకుంటాడు)

తెరలో:

ఇదీ స్మశానాధికారి జీవితం ! ముందు వెనుక లాలోచించని తలిదండ్రులకు బలియైన ప్రేమికుల గాథ. ఆమె కోసమే భాను పిచ్చివాడయ్యాడు. ఆమె ప్రేమకు నోచుకోని ఆ అభాగ్యుని జీవితం అలా భగ్నమై పోయింది. ఇహ 'రవి'ని ఎన్ని విధాలుగా ప్రయత్నించినా హృదయం మార్చి యింటికి తీసుకువెళ్ళలేక పోయారు. ఏరోజున తన ప్రియురాలు తనకు దూరమయ్యిందో ఆ రోజునే తానూ ప్రపంచానికి దూరమయ్యాడు.

(తెరలో - రాణి మొదటిపాట వినిపిస్తూంటుంది. రవి లేచి అనందంగా ఆ వైపే ఆలకిస్తూ వెళ్తూంటాడు)

(తెర వ్రాలును)

సంపూర్ణం.



ఈ క్రింది పొరపాట్లు సరిచేసుకోవాల్సింది.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 2వ | పేజీ | 14వ | లైను | — | మనస్పూర్తి |
| 4 | ” | 18 | ” | — | కూలి |
| 6 | ” | 3 | ” | — | రవీ, రాణీ ఫొటోలు |
| 8 | ” | 9 | ” | — | ధారపోయటానికి |
| 9 | ” | 8 | ” | — | యిష్టాఅయిష్టాలకోసం |
| | | 15 | ” | — | అప్పగిస్తున్నాము |
| 15 | ” | 13 | ” | — | (నవ్వి) |
| 35 | ” | 12 | ” | — | తేలిగ్గా |
| 42 | ” | 9 | ” | — | అవనిలో |
| 46 | ” | 15 | ” | — | షటప్ |
| 68 | ” | 4 | ” | — | లాచేశాను |
| 74 | ” | 19 | ” | — | వచ్చావా |
| 75 | ” | 3 | ” | — | ఏమిటండీ |
| | ” | 8 | ” | — | చేష్టలే |

—o—

## —* ప్రదర్శనకు కావలసిన పరికరాలు *—

సమాధి, ఎముకలు, పుర్రెలు, ఆకులురాలిన చెట్లు, టేబుల్, టేబుల్ క్లాత్, అద్దం, దువ్వెన, పూలకూజా, 4కుర్చీలు, భగవంతుని ఫొటోలు, సినిమా తారల క్యాలెండర్లు, రవి, రాణీ, రావు అతనిభార్య ఫొటోలు, పెన్ను, లెటర్ పాడ్, పోర్షన్ కాగితాలు, 2 సోఫాలు, రేడియో, గాంధీ, నెహ్రూ ఫొటోలు, పాతగుడ్డ, చలవకళ్ళజోడు, లెదర్ బ్యాగ్, పిస్టల్, డబ్బుసంచి, చేతికర్ర, పుట్టి, కత్తి, నల్లముసుగు, అయిదు రూపాయల కాగితం, "రిహార్సల్సు రూమ్" అనుబోర్డు, ఒక చాప, ఆర్కెష్ట్రా సామానులు, పేపరు, భగవద్గీతపుస్తకం, బెడ్డింగ్, లెదర్ బ్యాగ్, లెదర్ బాక్సు, బేడీలు మొదలగునవి.

ప్రదర్శకులకు నా సలహా —

ఈ నాటకం ప్రదర్శించటానికి కొద్దిగా శ్రద్ధతీసుకుంటే రక్తి కట్టించవచ్చు. మైక్ లేని పక్షంలో ప్రదర్శన రక్తికట్టదు, ప్రేక్షకులకు అర్థంకాదు. కాబట్టి చాలా అవసరం. సీను సీనుకీ మధ్య (నాటికకు ముందుకూడా) యెక్కువ టైం తీసుకోకుండా ప్రదర్శించటానికి ప్రయత్నించాలి. అందుకు అనుభవజ్ఞుడైన మేకప్ మేన్‌ను సహాకరింప చేసుకోవాలి.

8వ సీనులో 'రవి' పెద్ద డైలాగ్ చెప్పడం పూర్తవ్వగానే "భారతనారి" అను పాట పాడాలి. అప్పుడు రాణిని యెత్తుకు వెళ్ళటంగాని అక్కడ ఇన్స్ట్రక్షన్స్ యిచ్చిన ప్రకారం గాని చెయ్యాలి.

నాటకానుభవంగల ఒక వ్యక్తి నెవరి సహాయంతోనైనా యీ నాటకం ప్రదర్శించటానికి ప్రయత్నిస్తే చాలా బాగుంటుంది. బ్యాగ్రౌండ్ డైలాగ్సు చెప్పేవ్యక్తి బాస్‌వాయిస్ కలిగి, సాంఘిక నాటకాలను అలవాటుపడి వుండాలి.

ఈ నాటకానికి అవసరమైన మొసుకలు, పుర్రెలు మొదలగునవి మేకప్‌మేన్ పి. శివరావు, (శ్రీరాములు రోడ్-10వ వార్డు) గుడివాడ. వారివద్ద గలవు.

సాంఘిక నాటకాలు రక్తి కట్టటానికి కాంబినేషన్ అవసరం. అందుకు అందరూ సహకరించి రిహార్సల్సు చెయ్యాలి.

ఈ పై నియమాలను పాటించిన నాటకం రక్తి కట్టించవచ్చు.

— నమస్తే.

గట్లు,

రచయిత.

•••౦•••

# బి. యన్. సూరిగారి

## అచ్చయిన నాటకాలు :

కూలిపిల్ల. -
రైతుభూమి. -
సమాధి. -

## నాటికలు :

స్టేజీస్టార్స్. -
వెండితెర. -

## అచ్చులోవున్న నాటకాలు :

కూలిపోయిన కాపురం. -
పల్లెరైతు. -
లోకం. -

## నాటికలు :

కరువు. -
ట్రాక్టర్. -
సలీమా -
నేటినటి. -
ఆదర్శప్రేమ. -

వివరములకు
బి. యన్. సూరి,
C/o క్వాలిటీ బుక్‌షాప్ - గుడివాడ



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA130B121 |
| పుస్తకం పేరు | సమాధి |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | No |
| మొత్తం పేజీలు | 91 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | 6 |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | Kasimbi |
| పేజీలు విడదీసినది | Kasimbi |
| స్కాన్ చేసినది | Susmitha |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |